# తెలుగు సొగసులు

(విద్యార్థి యువతకై పరిచయవ్యాసాలు)

## సుధామ



# తెలుగు సొగసులు

(విద్యార్థి యువతకై పరిచయవ్యాసాలు)


**సుధామ**



ప్రచురణ:

**యువభారతి**

**తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు**

తిలక్‌రోడ్, హైదరాబాదు–500 001.

# TELUGU SOGASULU

(Beauty of Telugu Language
Introductary Essays for students and youth)

*by*

**SUDHAMA**
98 49 29 79 58



ప్రచురణ : 195

ప్రథమముద్రణ : ఆగస్టు' 2020

ప్రతులు : 1000

డి.టి.పి :
మను గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్
సెల్ : 93 93 83 40 50

ముద్రణ :
సతీష్ గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్
సెల్ : 96 42 14 44 22

ప్రతులకు :
యువభారతి
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాదు–500 001.

వెల : రూ. 50/–

"పద్యకళా ప్రవీణ", "కవి దిగ్గజ",
"ఏకవాక్య కవితా పితామహ"
**డా. ఆచార్య ఫణీంద్ర**
తెలుగు విశ్వవిద్యాలయ "కీర్తి పురస్కార" విజేత
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ

# భాషా 'సుధా మ'ధురానుశీలనం

"ఒక్క సంగీతమేదో పాడినట్లు భా
షించునప్డు విన్పించు భాష –
విస్పష్టముగ నెల్ల విన్పించునట్లు స్ప
ష్టోచ్చారణంబున నొనరు భాష –
రస భావముల సమర్పణ శక్తియందున
నమర భాషకును దీటైన భాష –
జీవులలోనున్న చేవ యంతయు చమ
త్కృతి పల్కులన్ సమర్పించు భాష –

భాషలొక పది తెలిసిన ప్రభువు చూచి
భాషయన నిద్దియని చెప్పబడిన భాష –
తనర ఛందస్సులోని యందమ్ము నడక
తీర్చి చూపించినట్టిదీ తెలుగు భాష!"

అన్నారు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు తెలుగు భాష వైశిష్ట్యాన్ని వివరిస్తూ–

తోడుకొన్న వారికి తోడుకొన్నంత మాధుర్యం,

సౌందర్యం అందించే క్షీర సముద్రం మన తెలుగు భాష. తెలుగు భాష సొబగులను పరిశోధనాత్మకంగా పరిశీలించి వివరించిన గ్రంథం ఇది. సాహిత్యాభిమానులకు, సాహిత్యాధ్యయనం చేస్తున్న విద్యార్థులకు ఎంతో ఉపయుక్తంగా ఉన్న ఈ గ్రంథాన్ని యువభారతి ప్రచురణగా అందించడం మాకు ఆనందదాయకం. సాహిత్య ప్రచారంతో సామాజికుల సౌమనస్యాన్ని వికసింపజేసే లక్ష్యంగా 55 ఏళ్ళకు పైగా కవి, పండితుల విశేషమైన ప్రసంగ కార్యక్రమాలను నిర్వహిస్తూ, అనేక సాహిత్య గ్రంథాలను ప్రచురించి ఆవిష్కరిస్తూ–తెలుగు సాహితీవేత్తల, నవ యువ సాహిత్యాభిమానుల అశేషమైన ఆదరణను చూరగొంటూ వస్తున్న సంస్థ మా "యువభారతి". లోగడ మా సంస్థ అందించిన "కావ్య

లహరి", "చైతన్య లహరి", "మహతి", "ప్రతిభా లహరి", "కవితా లహరి", "సంస్కృత సాహితీ లహరి", 'హాస్య లహరి" మొదలైన గ్రంథాలతోబాటు, నన్నయ, తిక్కన, పాల్కురికి, పోతన, శ్రీనాథుడు, పెద్దన, చేమకూర, వేమన, కంకంటి పాపరాజు వంటి ప్రాచీన మహాకవుల సాహిత్యంపై; విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, కుందుర్తి, దాశరథి, నారాయణరెడ్డి వంటి ఆధునిక కవుల సాహిత్యంపై విమర్శన గ్రంథాలు ఎంతటి ప్రజాదరణను పొందాయో సహృదయ పాఠకులందరికీ విదితమే. అదే సంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇటీవల "తెలుగునాట నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు", "పుంభావ సరస్వతి–పుట్టపర్తి", "అభినవ పోతన–వానమామలై" వంటి గ్రంథాలను ప్రచురించి ఆవిష్కరించడం జరిగింది. ఈ "తెలుగు సొగసులు" గ్రంథం మా సంస్థ అందిస్తున్న 195వ ప్రచురణ. ఈ గ్రంథకర్త శ్రీ సుధామగారు ప్రముఖ కవి, "ఆకాశవాణి" పూర్వకార్యక్రమ నిర్వహణాధికారి. అంతేకాదు– మా సంస్థలో చాల సీనియర్ సభ్యులుగా, మా సంస్థ ప్రచురణల ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు.

"అని, అనలేదని అనవచ్చు" గానీ, అక్షర బద్ధమైతే అట్లా అనలేని పరిస్థితి అంటారు సుధామగారు. అన్య భాషలను నేర్చినా మాతృభాషను విస్మరించకూడదు అంటారాయన. సమర్థ భావ వ్యక్తీకరణ కొరకు మాతృభాషలోని సొగసులను పునశ్చరణ చేసుకోవలసిన ఆవశ్యకతను వివరిస్తారు ఈ గ్రంథకర్త.

మన తెలుగు భాషలో అల్లుకుపోయిన "అందచందాలు", 'ఊరూవాడ", "చీకూ చింత", "భార్యాభర్తలు", "ఆదరా బాదరా" వంటి వివిధ రకాలయిన జంటపదాలు మన భాషకు ఎనలేని సిరిసంపదలుగా తులతూగుతున్నాయని విశదీకరిస్తారు. మన భాషలోని ఏకాక్షరాలను ఉటంకిస్తూ, ఒక్కొక్క ఏకాక్షరంలో ఎంతటి గంభీరమైన భావం దాగి ఉందో సోదాహరణంగా వివరిస్తారు. మన కావ్యాలు, ప్రబంధాలలోని వర్ణనలను వర్ణశోభితం చేసిన అనేక "కవి సమయాల"ను గూర్చి విశేషంగా వివరించి చెప్పారు రచయిత ఈ గ్రంథంలో. కాలానుగుణంగా కొన్ని పదాలకు అన్యార్థాలు స్థిరపడి "రూఢివాచకాలు"గా రూపొంది భాషకు కొత్త సొగసును కూర్చుతాయని తెలియజేస్తారు. "కుంభకర్ణుడు" అన్న శబ్దానికి నిద్రపోతు అన్న అర్థం రూఢియైనట్లే, ఆధునిక కాలంలో "సూర్యకాంతం" అన్న శబ్దం గయ్యాళి అన్న అర్థంలో రూఢి వాచకంగా మారిందని వివరిస్తారు ఆయన. సుధామగారు మనకు ప్రాచీనసాహిత్య పరిజ్ఞానంలో ఎంతటి ప్రాజ్ఞులుగా కనిపిస్తారో, అత్యాధునిక విషయ విజ్ఞానంలో అంతటి విద్వాంసులుగా దర్శనమిస్తారు.

తెలుగు భాషలోని ప్రత్యేకమైన సొగసులలో భాగంగా, ఒక పదాన్ని లేక పదబంధాన్ని అటు నుండి ఇటుగా, ఇటు నుండి అటుగా చదివినా ఒకే అర్థాన్ని ఇచ్చే వాటి నెన్నింటినో ఎత్తిచూపారు సుధామ గారు. సుప్రసిద్ధమైన "వికట కవి"తో బాటు "మందార దామం", "పంచాస్త్ర చాపం", "వినమని మనవి" వంటి పదబంధాలు పాఠకులను విశేషంగా

ఆకర్షిస్తాయి. అట్లాగే... ఒక పదాన్ని లేక పదబంధాన్ని అటు నుండి ఇటుగా, ఇటు నుండి అటుగా చదివితే వేరు వేరు అర్థాలను ఇచ్చే వాటిని కూడ ఆయన చూపారు. "రమ–మర", "గడప–పడగ", "కనుము–మునుక" వంటివి కొన్ని ఉదాహరణలు. కొన్ని క్రియలను వర్ణించేందుకు కొన్ని కొన్ని జంట పదాలు తెలుగు భాషలో గమ్మత్తుగా రూపుదిద్దుకొన్నాయని వివరిస్తారు సుధామ గారు. "గబగబ" నడవడం, "భగభగ" మండడం, "బడబడ" మాట్లాడడం, 'ధగధగ' మెరియడం, గాజులు "గలగల" మనడం లాంటి వన్నమాట. తెలుగు భాషలోని పర్యాయ పదాలను గురించి, ప్రాసాక్షరాలను గురించి వివరిస్తూ, వాటిని భాషను సుసంపన్నంచేసిన సొగసులుగా పేర్కొన్నారు. పత్రికల ద్వారా ప్రాచుర్యం పొందిన గళ్ళ నుడికట్లు లేక ప్రహేళిక లన్నవి సొగసైన భాషాక్రీడలుగా అభివర్ణిస్తారు. శ్లేషార్థాలతో తెలుగు భాషలో వెలసిన ద్వ్యర్థి మరియు త్ర్యర్థి కావ్యాలను గురించి వివరించడంతోబాటు, "మా రేడు నీవని, ఏరేరి తేనా మారేడు దళములు నీ పూజకు" అన్న వేటూరి గారి గీతాన్ని కూడ ఉదహరించి యువతను ఆకట్టుకొంటారు గ్రంథకర్త. ఊతపదాలు, పొడుపు కథలు కూడ భాషకు సరికొత్త అందాలను సమకూరుస్తాయని, ముఖ్యంగా... కొన్ని ఊత పదాలు కొందరు వ్యక్తులకు లేదా ఆ యా ప్రాంతాలకు గుర్తింపు పత్రాలుగా నిలుస్తున్నాయని అభిప్రాయపడ్డారు రచయిత. ప్రాంతాల సామాజిక, రాజకీయ, భౌగోళిక, సాంస్కృతిక కారణాల వలన భాషలో ఏర్పడే విలక్షణ వ్యవహారమే మాండలికమని, తెలుగు భాషను పరిరక్షించుకోవడమంటే, నాలుగు చెరగులా ఉన్న మాండలికాలన్నింటినీ గౌరవించి, సమాదరించి భావ వినిమయం చేసుకోవడమే– అంటారు సుధామగారు. ఈ భాషా ప్రేమికుని ఉద్దేశ్యంలో–భాషకు మాండలికాలు మట్టి దీపాలే కాదు.. మణి దీపాలు కూడ! భాషలోని సొగసులను అందిపుచ్చుకొని, భావ వినిమయాన్ని సమర్థవంతంగా చేసుకోవడం అవసరం అంటారు గ్రంథ రచయిత.

ఆంగ్ల మాధ్యమంలో చదువుకొంటున్న నేటి యువతకు ఇట్లా తెలుగు భాషా సౌందర్యాన్ని, మాధుర్యాన్ని పరిచయం చేస్తే, వారు ఆకర్షితులై, భావిలో మన తెలుగు భాషావారధులుగా, సారధులుగా రాణిస్తారని ఆశించవచ్చు. సుధామ గారికి నా హృదయపూర్వకాభినందనలు. ఈ ప్రచురణ మీ సమాదరణ పాత్రం కగలదని మా ఆకాంక్ష.

**ఆచార్య ఫణీంద్ర**
అధ్యక్షులు
**యువభారతి**

# తరాలు నిలు రాత

అటునిటు అయినా, ఇటునటు అయినా తరతరాలు తెలుగు తేజరిల్లాలనేదే భాషాభిమానుల ఆకాంక్ష. యువతకు ప్రేరణాత్మకమూ, ఉపయుక్తమూ అయిన విషయాలను లఘుప్రసంగాలుగా అందించాలనే సంకల్పంతో ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ఉదయంపూట ఏడుంబావుకు ఉదయతరంగిణి కార్యక్రమంలో 2011లో నాటి తెలుగు ప్రసంగ విభాగం కార్యక్రమ నిర్వహణాధికారి, మిత్రుడు ప్రముఖ కథారచయిత శ్రీ మంత్రవాది మహేశ్వర్ 'తెలుగుసొగసులు' అనే ఈ ప్రసంగాలను నాచేత చేయించారు. ఇందులోని అంశాల గురించి ఎంతో విస్తృతిగావిశ్లేషించగల అవకాశాలున్నా, రేడియోలో పదినిమిషాల కాలవ్యవధి మించకూడని ప్రసంగాలుగా సంతరించవలసిన అగత్యాన వీటిని విద్యార్థియువతకై పరిచయవ్యాసాలుగా తెలుగుభాషపట్ల ఆసక్తిని ప్రోదిచేసే సంకల్పంతో రూపొందించడం జరిగింది. ఆకాశవాణి శ్రోతల ప్రశంసలను అందుకున్నవీ వ్యాసాలు.

ఆంధ్రభూమి దినపత్రిక అప్పట్లోనే భాషకోసం ప్రతి శనివారం ఒకపూర్తిపుటను 'నుడి'పేరుతో నేటి 'అమ్మనుడి' సంపాదకులు శ్రీ సామల రమేష్‌బాబుగారి ఆధ్వర్యంలో వెలువరించడం జరిగింది. నాటి ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ ఎం.వి.ఆర్.శాస్త్రిగారు 'నుడి' పేజీలో ఈ వ్యాసాలను ధారావాహికంగా 2012 ఫిబ్రవరి 15 సంచికలో ప్రారంభించి 2012 మే 19 వరకు ప్రతిశనివారం ప్రచురించారు. ఆకాశవాణిలో ప్రసారమైన ప్రసంగవ్యాసాలనే యథాతథంగా ప్రచురించడం జరిగింది.

తెలుగు ప్రచురణరంగంలో తనదైన విశిష్టత కలిగిన యువభారతి సాహితీ సాంస్కృతికసంస్థ ముందునుండీ వీలైనంత తక్కువ ధరకు వీలయినంత ఎక్కువ మందికి అందించాలనే సంకల్పంతో ప్రచురణలను వెలువరిస్తూ వస్తోంది. యాభై ఆరు సంవత్సరాలుగా యువభారతి తన ప్రచురణలతో ప్రాచీన, అధునాతన సాహిత్యాన్ని ఒక సమ్యక్ దృష్టితో విశిష్టగ్రంథాలుగా పఠితృలోకానికి అందించింది. యువతలో సాహిత్యాభిరుచిని ఉద్దీపనం చేయాలనే సంకల్పంతో తన ఉనికిని ఉన్నంతలో నిలుపుకుంటూనే కృషి కొనసాగిస్తోంది.

ఇది యువభారతి 195 వ ప్రచురణ. తెలుగు భాషలోని సొగసులను వాచవిగా విద్యార్థియువతకు పరిచయం చేసి అనురక్తిని, ఆసక్తిని కలిగించే సంకల్పంతో రాసిన వ్యాసాలివి. అటు ప్రసారమాధ్యమంలో శ్రోతలనూ, ఇటు పత్రికా మాధ్యమంలో పాఠకులనూ కూడా అలరించిన ఈ వ్యాసాలను యువభారతి ప్రచురణగా గ్రంథరూపంలో వెలువరించడం ఆనందదాయకంగా వుంది. ఈ రచనలు 'సుధామధురం' బ్లాగ్‌లో అంతర్జాలంలో పొందుపరిచినపుడు అభివ్యక్తమైన కొన్ని అభిప్రాయాలను 'బ్లాగ్(లో)భాషణం'గా చివరలో చేర్చడం జరిగింది. పుస్తకంలో వ్యాసాలచివర కొన్నిచోట్ల గల ఖాళీజాగాల్లో చదివిన తరువాత మీకు కలిగిన భావాలను, మీకు స్ఫురించిన అంశాలను రాసి భద్రపరుచుకోగలరని యువపాఠకులను కోరుతున్నాను. మీరు చదివి, మరి నలుగురితో ఈ భాషాపరమైన సొగసులను పంచుకోగలరని అభిలషిస్తున్నాను. ఈ చిరుగ్రంథం మీకు నచ్చుతుందని విశ్వసిస్తూ, తెలుగు వెలుగు దీధితులు 'తరాలు నిలు రాత'గా తరతరాలు పరివ్యాప్తం కావాలని ఆకాంక్షిస్తూ....

సదా మీ
**సుధామ**
ప్రధాన సంపాదకులు
**యువభారతి ప్రచురణలు**

**"చుట్టూరా ఆవరించుకొనివున్న చీకటిని**
**తిట్టుకుంటూ వూరికే కూర్చోవడం కంటే,**
**ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది"**

**ఈ వాక్యమే మా యువభారతి ఊపిరి**

# విన్నపాలు

తెలుగు సొగసులు–

“సొగసు చూడతరమా”–తరమే.

ముఖ్యంగా ఈ తరానికి ఎంతో అవసరం.

మా “సుధామ”, తనకు పరిచయమైన తెలుగు సొగసులను విద్యార్థి యువతకు పరిచయం చేయడానికి పూనుకోవడం, చాలా మంచిపని. చిరకాల మిత్రుడిగా, మా యువభారతీయుడిగా, తెలుగు భాషపై, సాహిత్యంపై అభిమానం తరిగిపోతున్నట్లున్న ఈ తరుణంలో, ఈ పుస్తకం అమృతపు జల్లులాంటిది. అభినందనీయమైన కృషి. చదివి ఆనందించినప్పుడు అనిపించింది–ఇది మా యువభారతి ప్రచురణగా వెలువడితే–అందరికి అందుబాటులో వుండి ప్రయోజనం సిద్ధిస్తుందని.

ఈ సందర్భంగా కొన్ని విషయాల ప్రస్తావన, కొన్ని సూచనలు చేయడానికి నాకంత అధికారం లేదనే మనవిచేస్తూనే స్వతంత్రిస్తున్నందుకు, సాహసిస్తున్నందుకు ఈ ముందు మాటలు గమనించమని మనవి.

ప్రశ్న సమాధానాన్ని అన్వేషింపచేస్తుంది. సరైన సమాధానం దొరికినప్పుడు, ఒకవైపు ఆనందం కలగడంతోపాటు, ఆత్మవిశ్వాసం పెరగడం, అందుమూలంగా ముందుకు దూసుకుపోవడానికి కావలసిన ప్రేరణ కలగడం, నిరంతరం జరుగుతూ వుండే సత్యం, ప్రశ్నించే తత్త్వం ఆలోచనా సామర్థ్యాన్నీ పెంపొందింపజేసి, ప్రగతికి పునాదిరాళ్లనేర్పరచి, ఉజ్జ్వల భవిష్యత్తుకు రాచబాటలను ఏర్పరుస్తుంది. యుగయుగాలుగా మానవజాతి అన్ని రంగాలలోను సాధించి చూపిన ప్రగతికి, ఈ ప్రశ్నించే, అన్వేషించే పరిశీలించే, సమీక్షించే నైపుణ్యాలు అత్యంత ఆవశ్యకాలు. ఓపిక వుండాలేకాని, పరిశీలిస్తే, పునాదులూ ప్రత్యక్షమౌతాయి, రానున్న భవిష్యత్తూ అవగతమౌతుంది, అంతకన్నా ముఖ్యంగా వర్తమానంలో నిర్వహించవలసిన కర్తవ్యమూ బోధపడుతుంది.

సృష్టిలో మరే జీవికీ సాధ్యంకాని స్థాయిల్లో, ప్రజ్ఞాపాటవాలు మానవజాతికి అపురూప వరంగా దక్కాయి. భావప్రకటనకు కావలసిన భాషను, లిపిని, భావోద్వేగాల సొబగులను తీర్చిదిద్దటానికి కావలసిన పద్ధతులు కాలక్రమేణా సమకూరాయి.

ఈ సొగసులతో పరిచయం సౌందర్యారాధనకు, ఆనందాన్వేషణకు, ఎంతో ఉపయోగపడుతుంది.

మాతృభాషపై పట్టు సాధిస్తే, ఇతర భాషలను నేర్చుకోవడం సులభతరమౌతుందని, అనుభవజ్ఞులు చెపుతూ వుంటారు. కానీ, అనేక కారణాలవలన, ఈనాటి పరిస్థితులు ఈ వాస్తవాన్ని విస్మరిస్తూ, జరుగబోయే తీవ్ర నష్టాన్ని పట్టించుకోకుండా, కేవలం విదేశీనాగరికతా వ్యామోహంలో పడి, విదేశాలలో ఉద్యోగసంపాదనకే విద్య అవసరమని భావిస్తూ, విద్య పరమావధికి కొత్త నిర్వచనాలను ఇస్తున్నారు.

మన తెలుగు భాషకు సంబంధించినంతవరకూ గమనిస్తే–నేటి విద్యార్థులు, భాషాభిమానం లేదు సరికదా, భాషపై చిన్నచూపు చూపిస్తూ, వ్యవహరిస్తున్నారు. ఇద్దరు తెలుగువారు కలుసుకున్నప్పుడు తెలుగులో పలకరించుకోవడం అరుదుగా జరుగుతున్నది. తెలుగులో రాయడం చాలావరకు తగ్గిపోయినందువల్ల, రానున్న రోజులలో, చదవడానికి ఇబ్బందిపడే తరాలు కనబడతాయి. ప్రాథమిక దశనుండి, బోధనామాధ్యమాన్ని మాతృభాషలో కాకుండా, ఆంగ్లంలో ఉండేలా చేపట్టిన చర్యలవల్ల, వ్రాయడం చదవడం తగ్గిపోయి, కేవలం మాట్లాడే భాషగా మిగిలిపోయి, మరికొన్ని తరాలతరువాత, అర్థం చేసుకొనేవారు కూడా కనబడకుండా పోతారు. ఇలానే కొనసాగనిస్తే, వ్రాయడం, చదవడం, మాట్లాడడం, ఆలోచించడం, అర్థంచేసుకోవడం లాంటి ప్రాథమిక చర్యలన్నీ విస్మరించబడి, యునెస్కో వారు హెచ్చరిస్తున్నట్లు మన తెలుగు కూడా మృతభాషల జాబితాలో చేరిపోయే రోజు, నిజంగానే నిజమయ్యేరోజు, దాపురించే అవకాశాలు కనబడుతున్నాయి.

ఈ తరంవారైనా పూనుకొని కొంత ప్రయత్నం చేస్తే, బావుంటుందేమోనన్న ఆవేదనను గమనిస్తారేమోనన్న ఆశతో చేస్తున్న విన్నపాలు ఇవి. సాహసం చేస్తున్నందుకు క్షమించండి. ఒక ఉపాధ్యాయుడిగా, వ్యక్తిత్వ వికాస శిక్షకుడిగా, భావప్రకటనా నైపుణ్యాలను నేర్పించే సాధకుడిగా ఇవి నా నివేదనలు. నాకు తోచిన కొన్ని సూచనలను చేస్తున్నాను. మీరూ ఆలోచించి, అదనంగా మీకు తోచిన సూచనలు చేయగలరని విన్నవిస్తూ–

1. ప్రతిరోజూ, కనీసం 15 నిముషాల పాటైనా తెలుగు చదవడం అలవాటు చేసుకోండి. వీలున్నంతవరకూ, మంచి సాహిత్యాన్ని చదవండి. చక్కని భావ సంపదనూ, భాషాపాటవాన్ని మననం చేసుకుంటూ ఉండటం అవసరమని గమనించండి.
2. ఇలా చదవడం కొనసాగించడంవల్ల, తెలుగులో ఆలోచనలు చేసే అలవాటు కొనసాగుతుంది. అంటే, చేవను కాపాడుకున్నట్లే.
3. ప్రతిరోజూ చదవడంతోపాటు, వ్రాయడం అవసరం. ఆలోచనలకు అక్షరరూపం ప్రాణాన్నిస్తుంది; కొత్త ఊపిరులను పోస్తుంది. ప్రాణాన్ని నిలుపుతుంది. ప్రతిరోజూ చదివిన భాగం నుండి, ప్రధాన విషయాలను తెలుగులో వ్రాయడం అలవాటు చేసుకోండి.

4. తెలుగులో ఆలోచించడం, చదవడం, వ్రాయడంతో పాటుగా మాట్లాడడం, వినడం చాలా అవసరమని గుర్తించండి. వీలున్నంతవరకూ, తెలుగులో మాట్లాడే అవకాశాన్ని చేజిక్కించుకోండి. ఇతరులు మాట్లాడుతున్నప్పుడు మనం వినడం జరుగుతుంది. నిజానికి, మనం మాట్లాడుతున్నప్పుడు కూడా, మనం మన మనసులో వినడం అనే ప్రక్రియ కొనసాగుతూనే వుంటుంది.

5. చాలా సాధారణ అంశాలుగా అనిపిస్తున్నప్పటికీ–ఆలోచన సాగుతూవున్నంత వరకూ, ప్రాణం మిగిలివున్నట్లే. చదవడం, వ్రాయడం, మాట్లాడడం, వినడం, ఆరోగ్యాన్నిస్తాయి. వీటితో బాగా పరిచయంవున్న మనకు ఏ మాత్రమూ కష్టంగా అనిపించదు. ఇప్పుడు చేయవలసినదల్లా, మన తరువాతి తరాలకు ఈ సంపదను పరిరక్షించి వుంచడం.

6. ఈనాటి తరంలో తెలుగుపట్ల పెరుగుతున్న విముఖతను మరింత పెరగకుండా జాగ్రత్త పడడానికి, ఈ పేర్కొన్న అంశాలను పాటించడమే ఉత్తమమైన మార్గం. చిన్న వివరణ అవసరం. పేర్కొన్న అంశాలన్నీ, మీకు, కొత్తగా కానీ కష్టంగాకానీ వుండవు. మీ కుటుంబంతోసహా అంటే, పిల్లలతో సహా పైన ప్రస్తావించిన చదవడం, చదివించడం, మాట్లాడడం, మాట్లాడించడం, వినడం, విన్పించడం, వ్రాయడం, వ్రాయించడం, ఆలోచించడం, ఆలోచింపచేయడం–అంతా ఒక కర్తవ్యంగా, నిత్యకృత్యంగా, యజ్ఞంగా, ప్రేమతో చేయవలసిన అవసరాన్ని గుర్తించడం, ఆచరించడం, మనకు తెలిసిన వారందరూ ఆచరించేలా చేయడం, మన బాధ్యత అని పూనుకోండి.

7. అందరూ పూనుకోవలసిన అవసరం నిజమే అయినప్పటికీ, ఈ విషయంలో మహాసంకల్పం చెప్పుకొనవలసిన బాధ్యత కన్నతల్లులదే. తల్లులు పూనుకొంటే, సాధించలేనిది ఉంటుందా? "ముదితల్ సాధించలేని కార్యం గలదె?"

ఈ పుస్తకం ఈ పూనికకు ఏ మేరకు సహకరించినా యువభారతికి సంతోషం.

**"అక్షర రూపం దాల్చిన**
**ఒకే ఒక సిరా చుక్క**
**లక్షమెదళ్ళకు కదలిక"**
**– కాళోజి**

**ఆచార్య వంగపల్లి విశ్వనాథం**
సమావేశకర్త
**యువభారతి**
చరవాణి: 79891 80414
viswam.vangapally@gmail.com

# తెలుగు అమృత భాష

**భా**ష భావవినిమయ సాధనం. భావవ్యక్తీకరణ చేయడానికి–ఇంకొకరితో మాట్లాడటానికి భాషను ప్రయుక్తం చేస్తాం. అలాగే రాయడానికీ భాషను వినియోగిస్తాం. మాట్లాడినప్పుడు మాట. రాసినప్పుడు లిపి. మాట్లాడే భాషకూ, రాసే భాషకూ ఒకప్పుడు అంతరం వుండేది. గ్రంథస్థమైన భాషను గ్రాంథికం అనీ, వ్యవహరించే భాషను వ్యావహారికం అనీ అన్నారు. కానీ, రాను రాను మాట్లాడినట్లే రాయాలనీ, అందువల్ల రాసింది చదివినప్పుడు, మాట్లాడినట్లే అనిపించి, నిజమైన భావవినిమయం సరళంగా, సూటిగా జరుగుతుందనీ ఒక ఉద్యమంలానూ జరిగింది. కానీ ఇప్పటికీ మాట్లాడ్డానికీ రాయడానికీ మధ్య, భాషను ప్రయుక్తం చేయడంలో అనివార్యంగా కొంత అంతరం వుంది. ఒకమాట అని, నేను అనలేదని ఆ తరువాత మాటలతోనే త్రోసిరాజనవచ్చు. కానీ అదే రాసినప్పుడు లిఖితరూపంగా వుండి, వ్యక్తీకరించిన విషయం తిరుగులేనిదిగా నమోదవుతుంది. అందుకే 'అక్షరం' అంటే క్షరము కానిది, నశించనిది అని అర్థం మరి! అందుకనే లిఖితపూర్వక విషయాలకు వుండే విలువ, 'మన్నిక కాలం' ఎక్కువ. ఒక విషయం ప్రభావవంతంగా మాట్లాడటానికి కూడా అందువల్లనే ముందుగా చెప్పదలుచుకున్న దానిని వ్రాతపూర్వకంగా కూర్చుకోవడం జరుగుతుంది.

ఇంతకీ మాట్లాడినా, రాసినా–అదే తెలుగు, అదే వర్ణమాలలోని అక్షరాలనే అందరూ ఉపయోగిస్తున్నా కొందరు మాట్లాడే మాటలు ఎంతో శ్రవణానందకరంగానూ, అలాగే కొందరి రచనలు పఠితలకు ఎంతగానో ఆసక్తిదాయకాలూ కావడానికి హేతువు భాషలోని వ్యక్తీకరణే! సాహిత్యం 'ఆలోచనామృతం' అన్నారు. అది మౌఖికమైనా, అక్షరబద్ధమయినా అట్టిదిగానే రాణించాలి. తెలుగు భాషలో సహజంగానే ఎంతో గొప్ప పదసంపద వుంది. ముఖ్యంగా భాష సజీవంగా నిలవడానికి, మనుషుల మధ్య నిరంతరంగా అది వినిమయమవుతూండాలి. అన్యభాషలు నేర్చినా మాతృభాషను పరిపుష్టం చేసుకోవాలే కానీ–విస్మరించకూడదు. వ్యక్తీకరణకు అనుకూలంగా, కాలావసరాలకు తగినట్లుగా భాషను పెంపుచేసుకుంటూండాలి. కొత్త పదసృష్టి స్వభాషలో జరుపుకుంటూండాలి. కొత్త పదసృష్టి స్వభాషలో జరుపుకోకుండా, పాతబడిన మాటలంటూ–వున్నదానిని కూడా పోగొట్టుకోవడం విజ్ఞత కాజాలదు!

భావవ్యక్తీకరణకు సమర్థం కాకుండా భాషను పడగొట్టుకున్నా, ఆధునాతన శాస్త్రసాంకేతిక ప్రగతికి అనుగుణంగా తగిన పదసంపద కూర్చుకుని భాషను

విస్తరించుకున్నా అది మనం చేసుకునేదే! మన తెలుగు భాషలో ఎంతో మాధుర్యం వుంది. 1921లో పానుగంటివారు 'స్వభాష' అనే సాక్షి వ్యాసంలో పేర్కొన్నట్లు – "మన భాషయే–మకరంద బిందుబృంద రసస్యందన సుందరమగు మాతృభాషయే–మహానంద కందళ సందోహ సంధాన తుందిలమగు మాతృభాషయే–క్రమతకు క్రమత, కఠినతకు కఠినత, వదలునకు వదలు, బిగికి బిగి, జోరునకు జోరు, ఎదురెక్కునకెదురెక్కు, మందతకు మందత– ధాటికి ధాటియూ, నన్నివన్నెలు, నన్నిచెన్నెలు, నన్నివగలు, నన్ని వద్దికలు, నన్నితళుకులు, నన్నిబెళుకులు, నన్నిహొయలు, నన్ని మొయ్యారములు కలిగిన మన మాతృభాషయే. వ్యాసమునకు, ఉపన్యాసమునకు కవిత్వమునకు గానమునకును సంపూర్ణార్హత కలిగిన భాషయే! పైవారే యా భాషను పట్టుదలతో ప్రయత్నమున నభ్యసింపవలసియుండగా మనవారే దానినంత యధమాధమముగా చూచుట తగునా" అన్న ఆర్తి నేడు మరీ ఔచితీమంతం!

తెలుగు భాషలో బోలెడు సొగసులున్నాయి. తత్సమాలు, తద్భవాలు, దేశ్యాలు మొదలుకొని నేడు ఆంగ్లాది అన్యభాషా పదాలను సైతం భావ వ్యక్తీకరణానుకూలంగానే 'తెలుగు' తనలో కలుపుకుంది. అయితే నేడు తెలుగుభాష అస్తిత్వమే ప్రశ్నార్థకమయ్యే స్థితి పొడచూపుతోంది అంటే అందుకు కారణం మన భాష సమర్థతను, మన భాషలోని సొగసులను మనమే గుర్తించక, వినియోగంలో స్వయంగా చేజార్చుకుంటూ వుండడమే. మాట్లాడడానికయినా, రాయడానికయినా తెలుగు భాష మీద పట్టుకావాలి. అది పట్టుకునే పట్టుదల కావాలి. భాషలోని సొగసులను గ్రహించి, అందిపుచ్చుకుని, నిత్య వ్యవహారంలో, లేఖనంలో నిలుపుకోవాలి. "తెలుగు మాట్లాడే దీపాలు తెల్లవార్లూ వెలుగుతూనే వుంటాయి" అని ఆరుద్ర అన్నట్లు మన తెలుగు భాషలో సొగసులు సతత హరితాలు. సదా అవధరణీయాలు. భాషలో మౌలికంగా వున్న అలాంటి కొన్ని సొగసులను విస్మృతిలోకి పోకుండా ఉన్న సంగతులనే ఈ తరానికి పెన్నిధులుగా అందించుకోవాల్సిన అవసరం వుంది కనుక, తెలుగు భాషావికాసం మన తెలుగువారందరి కర్తవ్యం కనుక, మన భాషలోని సొగసులను కొన్ని ఉపయుక్తం చేసుకునేందుకు పునశ్చరణలోకి తెచ్చుకుందాం. తెలియని సంగతులని కాదు గానీ, తెలిసిన సంగతులనే మళ్ళీ ఓ మారు మాటల్లో కలబోసుకుందాం. ముందుగా భాషలో సొగసుగా వున్న 'జంటపదాలు' అనే అంశం చూద్దాం!

# జంటపదాలు.. భాషకు సిరిసంపదలు

ఆమె 'అందచందాలు' ఎంతగానో నచ్చాయి. 'ఊరూవాడా' ఆ విషయం తెలుసు. 'చీకుచింత' లేకుండా 'ఈడుజోడు' అయి బ్రతకాలంటే 'చేదోడువాదోడు'గా వుండాలి. ఇలాంటి మాటలు మనం తరచుగా వింటూ వుండేవే. వీటిల్లో అందచందాలు, ఊరూవాడా, చీకుచింత, ఈడుజోడు, చేదోడువాదోడు వంటివాటినే 'జంటపదాలు' అంటాం. ఇలాంటి జంటపదాలు ప్రయోగించడంలో గొప్ప సొగసు వుంది. వట్టి సొగసుమాత్రమే కాదు, ఎంతో అర్థవంతమైన భావవినిమయం వుంది. అందచందాలు అన్న జంటపదమే చూడండి–అందం అంటే సౌందర్యం. నిజానికి సౌందర్యం అనేది ఒక విధానంలో, రీతిలో సజావుగా వుండాలి. చందము అన్నదానికి విధము, రీతి, ప్రకారము అని అర్థం. అందం చందం రెండూ వున్నప్పుడే పూర్ణత్వం, చందము అన్నదానికి కర్పూరం అనే అర్థం కూడా వుంది. బంగారానికి తావి అబ్బినట్లు అంటూంటాం. అలాగే సౌందర్యం పరిమళభరితం అయితే విలువ ఎక్కువ. అందచందాలు అనడంలో అంత విశేష అర్థస్ఫూర్తి వుంది.

మన భారతీయ సంప్రదాయంలో దాంపత్య బంధానికి ఎంతో విలువ. అందునా స్త్రీకి ప్రథమస్థానం. 'భార్యాభర్తలు', 'అమ్మానాన్న' వంటి జంట పదాలను ప్రయుక్తం చేయడంలోనే కాదు, సీతారాములు, ఉమామహేశ్వరులు, లక్ష్మీనారాయణులు వంటి వాటిని కూడా జంటపదాలుగా వ్యవహరిస్తూ స్త్రీని ప్రథమగణ్యగా ఉటంకిస్తూంటాం. జంటపదాలులో 'తికమక' ఏం లేదు. భావనలను 'తారుమారు' చేయదు. జంటపదాల 'తళుకుబెళుకు'ల్లో 'ఎగుడుదిగుడు'లు ఏమీ ఊహించనవసరం లేదు. 'మాటామంతీ'లో జంటపదాలు 'ముందువెనుక'లు చూసి ప్రయోగించుకుంటే, 'చదువు సంధ్యలు'లో వాటి ఉపయుక్తం గ్రహించుకుంటే, మన భావాభివ్యక్తి 'బాగోగులు' జంటపదాలు చూసుకోగలుగుతాయి.

సుఖ దుఃఖాలు, సిరిసంపదలు, కలిమిలేములు, పాపపుణ్యాలు, చీకటి వెలుగులు ఇవన్నీ జంటపదాలే. కొన్ని జంటపదాలు ఒక అంశం యొక్క ఇరుపార్శ్వాలను ప్రతిబింబించేవయితే, మరికొన్ని ఆద్యంత సమాహారాన్ని సూచించేవి. ఇంకొన్ని సమర్థక, వ్యతిరేకార్థక సమన్వయ సూచికలు. 'కష్టసుఖాలు' జీవితం ఇరుపార్శ్వ ప్రతిబింబకాలు. 'సూర్యచంద్రులు' అన్న జంటపదం ఒక రోజు యొక్క ఆద్యంత సమాహారమే. 'మంచిచెడు' అనేది సమర్థక వ్యతిరేకార్థక జంటపదమే.

రూపురేఖలు, వేషభాషలు, వేళాపాళా, సిగ్గు ఎగ్గు, కూలీనాలీ, ఇంచుమించు ఇలాంటి జంటపదాలన్నీ విరివిగా వింటూనే వుంటాం. 'ఇంచుమించు' అన్న జంటపదంలో ఇంచు అన్నదానికి అల్పత్వము, న్యూనత్వము, ఇంచుకతనము అని అర్థం కాగా, 'మించు' అన్నదానికి ఒప్పు, శోభిల్లు, అతిశయించు, తళతళ మెరియు అనే అర్థాలున్నాయి. కానీ 'ఇంచుమించు' అని వాడినప్పుడు రమారమి, ఎక్కువ తక్కువగా అనే రూఢ్యర్థంలోనే వాడుతున్నాం. అదీ దీని సొబగు. ఇంచు అన్నదానికి చెఱకు అనే అర్థం కూడా వుండడంవలన చెఱకు విలుకాడు అయిన మన్మథుడిని ఇంచువిల్తుడు అనడమూ వుంది. సరే! అది వేరు సంగతి.

'చిటపట'లాడాడు, 'గడబిడ' చేసాడు, 'చీటికిమాటికి' గుర్తుచేస్తున్నాడు, 'పాపపుణ్యాలు' దేవుడెరుగు, 'మూటముల్లె' సర్దుకున్నాడు, 'కట్నకానుకలు' కోసం 'కోపతాపాలు' చూపడం, 'అవాకులు చెవాకులు' పలకడం సరికాదు. ఇలా వాక్యాలు జంటపదాలు ఎన్నిటినో ప్రయోగించడం జరుగుతూనే వుంటుంది. జంటపదాలు విడగొట్టి మొదటి పదానికి అర్థం, రెండోపదానికి అర్థం విడివిడిగా చూసుకుంటే కనబడే సొగసులు వేరు. ఒకటిగా ఆ జంటపదం ప్రయుక్తం అయినపుడు ఒక్కోసారి ద్యోతకమయ్యే సొగసు వేరు. శ్రద్ధాసక్తులు, భయభక్తులు, ధనధాన్యాలు, ధూపదీపాలు, పేరుప్రతిష్ఠలు, భోగభాగ్యాలు అంటూ ఇలా జంటపదాలు అనేకం వున్నాయి. ఏ రెండుపదాలు పడితే ఆ రెండు పదాలు కలిపేస్తే జంటపదాలు అయిపోతాయనుకుంటే పొరపాటు. జంటపదాల నిర్మితిలో ఓ సొబగు వుంది. అది భాషలో విలక్షణమైనది, విశిష్టమైనది కూడాను. కూడుగుడ్డ, ఇల్లూ వాకిలి, ఉప్పూపప్పు, ఉలుకు పలుకు, ఇంపుసొంపు, గొడ్డుగోద, చెట్టుచేమ ఇలా జంటపదాలు గురించి 'చాటుమాటు' కాక 'చేదునిజాలు' గానే భాషా సౌందర్యాన్ని 'తప్పుఒప్పులు' లేకుండా పట్టుకోవచ్చు.

భాషలోని ఈ జంటపదాల సౌందర్యం కూడా 'అతీగతీ' లేకుండా పోయే పరిస్థితి రాకుండా ఇవాళ మనం ప్రసార మాధ్యమాల్లో యాంకరింగ్ అని చెప్పుకునే వ్యాఖ్యానాల్లో సందర్భోచితంగా చేర్చి ప్రయోగిస్తుంటే తెలుగు సౌందర్యం తేజరిల్లడమే కాదు, నిజంగా శ్రవణంలో ఆసక్తి, అనురక్తి పెరుగుతాయి. యాంకర్ విజయానికి ఇవి 'అండదండలు'గా వుండగలుగుతాయి.

'ఆదరాబాదరా' కాకుండా సావకాశంగా జంటపదాలను అధ్యయనం చేసి చూడండి. వాటి 'బాగోగులు' అర్థమవడమే కాదు, భాషకు అది ఎలాంటి 'సిరిసంపదలు' అయి నిలుస్తున్నాయో కూడా తెలుస్తుంది. భాషలోని సొగసు పార్శ్వాన్ని అందివ్వడమే ఇక్కడి వంతు, అల్లుకుపోవడం భాషాభిమానులైన అందరి తంతు. ఏమంటారు?!

# ఒక్క అక్షరం.. లక్షల భావాలు

**"అ**క్షరరూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్లకు కదలిక''–అంటాడు కాళోజీ కవి. అక్షర సముదాయాలు కాక, కేవలం ఒకేఒక అక్షరం కూడా గొప్ప అర్థవంతంగానూ, ప్రయోజనాత్మకంగానూ భావిస్తున్న దాఖలా మన భాషలో వున్నదే. తెలుగులో అనేక సంస్కృతపదాలు ఎప్పుడో చొరబడిపోయాయి. ఇవాళ మనం వాడుతున్న తెలుగు అచ్చతెలుగు కానేకాదు కానీ అచ్చంగా తెలుగుభాష సంపద్వంతమయింది. అన్యభాషా పదాలు– గ్లాసు, రోడ్డు, రైలు వంటి పదాలు ఇంగ్లీషువని అనుకోలేనంతగా నేటి తెలుగులో కలిసిపోయాయి. ఏకాక్షరాలు గురించి మాట్లాడుకుంటున్నప్పుడు 'శ్రీ' అనేది భాషలో ఎంత గాఢంగా, హృద్యంగా స్థిరపడిందో ముందే చెప్పాలి. 'శ్రీ' అంటే 'సిరి' అనే. 'శ్రీ' అంటే మంగళదాయకమైన పదం. గౌరవ సూచకంగా మగవాళ్ల పేర్లకు ముందు శ్రీ అనే ఏకాక్షరాన్నే రాస్తుంటాం. పేరుకు ముందు శ్రీ పెట్టలేదని అలిగేవారూ వుంటారు. శ్రీ అంటే లక్ష్మి, ధనం, సంపద, సమృద్ధి, శోభ, కాంతి, హొదా, కీర్తి అనే అర్థాలున్నాయి. శ్రీకాళహస్తిలోని శ్రీ అంటే సాలెపురుగు.

రమాకుమారుడు అంటే మన్మథుడు అని అర్థం. ఆ పదంలో ముందునుంచీ ఒక్కొక్క అక్షరం తొలగిస్తూ మాకుమారుడు, కుమారుడు, మారుడు, రుడు, చివరికి డు అనే ఏకాక్షరానికి కూడా మన్మథుడు అనే అర్థం. ఈ సొబగు భాషలోనిదే మరి! అవును, సరే అనడానికి మనం ఒక్క 'ఊ' అని సరిపెడుతున్నామంటే ఏకాక్షరంలో ఎంత అర్థం గంభీరంగా దాక్కుని వుందో చెప్పాలా? అలాగే 'జే' కొట్టడం, 'జై' అన్న ఏకాక్షరంలో విజయనాదం వుంది. ఇవాళ యువతరం 'యా' అనే ఒక్క ఆంగ్లపదాన్ని అంగీకారసూచక సమ్మతి భావవ్యక్తీకరణకు ఎంతో అలవోకగా వాడేస్తోంది. 'ఊ' కొట్టడం అంటే తెలుగులో సమ్మతిని ప్రకటించడమే. అమ్మ కథ చెబితే శ్రవణానుభూతిని పొందుతున్న సూచికగా పిల్లలు ఊ కొడుతూంటారు. తెలుగు వర్ణమాలలో తొలి అక్షరమైన 'అ' అనేదానికి బ్రహ్మ, విష్ణువు, శివుడు, వాయువు అని అర్థం వుంది కానీ తెలుగులో వ్యస్తప్రయోగం లేదంతే! మళ్లీ అదే 'ఆ' అనే దీర్ఘాక్షరానికి 'ఫలానా', 'ఆ యొక్క' అనే అర్థాలున్నాయి. ఆ వేళ, ఆ రోజు అంటూ 'ఆ' చేర్చి నియమిత కాలాన్ని సూచించడం వుంది. అలాగే 'ఈ' అనేది ఇప్పటి, వర్తమాన సూచికగా వినియోగిస్తాం. 'ఆ' దూరం వున్నదానిని సూచించే అక్షరమైతే, 'ఈ' దగ్గర వున్నదానిని అభివ్యక్తీకరించే అక్షరం. వ్యస్తప్రయోగం లేకపోయినా 'ఉ' అన్నా శివుడు, చంద్రుడు, రక్షకుడు అన్న అర్థాలున్నాయి. అలాగే 'ఏ' అనే ఏకాక్షరం

ప్రశ్నార్థకంగా, సందర్భానుసారం ఆశ్చర్య ప్రశంసాదులు తెలిపేదిగా వుంది. చూచితిరే, రావే అనే పదాల్లో 'ఏ' కారం అలా చొరబడిందే. 'ఐ' అనే అక్షరం 'అగు' ధాతువుయొక్క క్త్వార్థక రూపం. ఐ కొన్ని చోట్ల 'అయి'గా మారి వ్యవహరింపబడుతుంది. అలాగే 'ఓ' అనే ఏకాక్షరం సంబోధనను, ప్రార్థనాదులను తెలిపేదిగా 'ఒక' అనేదానికి క్లుప్తీకరణంగా వ్యవహృతమవుతోంది. 'అం', 'ఆం' అనేవాటిని చిన్నపిల్లలకు గోరుముద్దలు తినిపిస్తూ పెద్దలు ప్రయోగించడం తెలిసిన సంగతే కదా!

ఇక హల్లుల్లో 'క' తెలుగులో వ్యస్తప్రయోగం లేకపోయినా బ్రహ్మ, విష్ణువు, ఆత్మ, పక్షి, దేహం, గరుడుడు, నీరు వంటి అర్థాలు కలిగింది. "కవి యను నామంబు నీటికాకికి లేదే' అనడానికి కారణం క అంటే నీరు, వి అంటే విహంగము అనే అర్థాలుండడమే. నీ జట్టు 'ఖ' అంటూ పిల్లలు జట్టు నుంచి విడివడే భావ వ్యక్తీకరణకు 'ఖ' ప్రయోగిస్తుంటారు. 'ఆ' అనే అర్థంలో తెలంగాణలో 'గా' అనే అక్షర ప్రయోగం వుంది. గావేళ, గాసోటు, గాదినం వంటి ప్రయోగాలున్నాయి. అలాగే 'ఈ' కి 'గీ' అనే వాడకం. చి అనే ఏకక్షరాన్ని 'చిరంజీవి' అన్న భావనకు సంకేతంగా పిల్లల పేర్ల ముందు సంకేతించి రాతలో ప్రయోగించడం వుంది. 'ఛా' 'ఛీ' అనేవి నిందార్థకాలుగా, అసహ్య సూచకాలుగా ప్రధానంగా మాటల్లో వాడుతూనే వుంటాం. 'ఢీ', 'ఠా'వంటి ఏకాక్షరాలు గొప్ప సంఘటనాత్మ భావ సూచికలుగా నేడు పత్రికల పతాక శీర్షికల్లోనూ 'లారీ ఢీ ఇద్దరు ఠా' అన్న ధోరణిలో వాడుతూన్నారు. నా, నీ అనే అక్షరాల సంగతి మా, మీ అనే అక్షరాల సంగతీ ఏకాక్షరాలుగా వాటి అభివ్యక్తి సామర్థ్యం అందరూ ఎరిగినదే. 'తై' అనేది నృత్య సూచికగా, 'థూ' అనేది నిందార్థకంగా వున్నాయి. 'ఫో' అనే ఏకాక్షరం పొమ్మని, 'పై' అనేది ఉపరితల సూచికంగానూ వుండగా పువ్వు అనే అర్థంలోనూ, అశ్లీలార్థకంగానూ కూడా ఓ ఏకాక్షరం కానవస్తుంది. 'భౌ' అనే ఏకాక్షరం కుక్క అరుపుకు సంకేతం. ఇక 'రా' అనే ఏకాక్షరం పిలుపుకీ, ఆత్మీయతకూ, సాన్నిహిత్య భావనకూ భాషలో సొగసుగా రాణిస్తోంది. 'లం' అనే అక్షరానికి బురద అనీ, 'జ' అంటే పుట్టింది అనే అర్థంలో బురదలో పుట్టిన పద్మానికీ, లక్ష్మికీ సంకేతంగా ఏర్పడిన పదం నిందార్థకంలో స్థిరపడడం విషాదమే. 'నో', 'లౌ' అనే తెలుగు అక్షరాలు ఇంగ్లీషులోని వద్దు, వలదు, ప్రేమ అనే భావనలు ప్రతిబింబించే ఏకాక్షరాలుగా చాలా విరివిగా వాడబడుతున్నాయి. అలాగే 'గో' అనేది తెలుగులో ఆవు'కీ' ఆంగ్లంలో 'వెళ్లు' అనేదానికీ నిలబడి ప్రయుక్తమవుతున్న ఏకాక్షరమే. ఇవి వాచవిగా చెప్పిన ఏకాక్షర భావవివరణలే. భాషలో సొబగులను ఇలా ఏకాక్షరాలుగా మరిన్నింటిని గ్రహించే వేడుక, అధ్యయనం ఇక మీదేమరి. సరేనా!

# భాషకు 'సమయాల' సోకు

**మ**న ప్రబంధాలు, కావ్యాలు భాషాపటిమను, భాషాసౌందర్యాన్ని అందించేవిగా వున్నాయి. తెలుగుసాహిత్యంలో ప్రబంధయుగం అని ప్రత్యేకంగా పేర్కొంటాం. శ్రీకృష్ణదేవరాయలు తన ఆస్థానంలో అష్టదిగ్గజ కవులను సమాదరించడం మాత్రమే కాదు, స్వయంగా ఆముక్తమాల్యద అనే ప్రబంధం రచించాడు. ప్రబంధ రచన అనేది కవియొక్క ప్రత్యేక ప్రతిభ. దానికొక రచనా సంవిధానం వుంది. ప్రబంధాలలో అష్టాదశవర్ణనలను కవులు పాటించారు. వాటిద్వారా 'కవి సమయాలు' అనేవి ప్రాచుర్యంలోకి వచ్చాయి. భాషలోని సొగసులో కవిసమయాలు ఒకటి.

సమయం అంటే సంప్రదాయం. అంటే ఆచారం లేక మర్యాద. ఈ సంప్రదాయాలు దేశదేశాచారాల లాగా ఎప్పుడో ఏర్పడినవే. సంఘజీవులయిన వ్యక్తులు దేశాచారాలు పాటించవలసినట్లే, కవులు ఔచిత్యంతో రచన చేయడానికి 'కవి సమయాలు' పాటించారు. 'కవి సమయాలు'గా రూఢమైన వాటిని మార్చడానికి వీలులేదు. మారిస్తే భాషే తలక్రిందవుతుంది. అయితే ఔచిత్య దృష్టితో కొత్తవాటిని సృష్టించుకోవచ్చంటారు అలంకారికులు. 'కవి సమయాలు' అంటే ఎక్కువగా ప్రకృతిగత విషయాలే. ఉన్న ధర్మాన్ని నిబంధించడం, లేని ధర్మాన్ని నిబంధించడం, కొన్నింటికి కొన్నింటి పట్లనే ఉనికిని నిబంధించడం ఈ కవి సమయాల్లో చూస్తాం.

కవి సమయాలలో కొన్నింటిని వర్ణించడానికి, కొన్నింటిని వర్ణించకపోవడానికి నియమాలున్నాయి. మాలతీలత వసంతంలో పుష్పించుతున్నట్లు, చందనద్రుమాలకు ఫలపుష్పాలున్నట్లు, ఆశోకానికి పండ్లున్నట్లు, కృష్ణపక్షంలో వెన్నెల వున్నట్లు, శుక్లపక్షంలో అంధకారం వున్నట్లు, మల్లెమొగ్గలకు, కాముకుల దంతాలకు తాంబూలం వేసుకున్నా ఎర్రదనం వున్నట్లు వర్ణించకూడదు. అలాగే పగటి నీలోత్పల వికసనం స్త్రీలకు నల్లదనం వర్ణించరు. నదులలో పంకజాలు, నీలోత్పలాలు, తటాకంలో హంసలు, పర్వతాల్లో బంగారం, రత్నం, ఏనుగులు లేకపోయినా, వున్నట్లు వర్ణించడం కవి సమయం.

చీకటిని పిడికిట్లో పట్టుకోవచ్చట. సూదులతో భేదింపవచ్చునట. ఆకాశగంగలో దిగ్గజాలు స్నానంచేస్తాయి. వెన్నెలను దోసిళ్లతో ఎత్తవచ్చు. శివుని తలపై వున్న చంద్రుడు ఎప్పటికీ బాలచంద్రుడే అని వర్ణించడం కవిసమయమే.

అలాగే రంగుల విషయం. కొన్ని కొన్ని రంగులను కొన్ని కొన్ని భావాలకు ప్రతీకలుగా వర్ణించడం కవిసమయాల్లో వుంది. కీర్తిని, పుణ్యాన్ని, నవ్వును తెలుపుతో; అపకీర్తిని, పాపాన్ని నల్లదనంతో; కోపాన్ని, అనురాగాన్ని ఎర్రగా అలాగే శైల, వృక్షాది,

మేఘ, సముద్ర, లతలకును, రాక్షస, ధూప, పంక, కేశములకు నల్లదనమే వర్ణించాలి. చందనవృక్షాలు మలయపర్వతంలోనే వుంటాయి. వసంతంలోనే కోకిల కూస్తుంది. వర్షాకాలంలోనే నెమలి నాట్యమాడుతుంది. కేకి కేకలు వేస్తుంది. కృష్ణ అంటే నలుపు, నీల అంటే ఆకాశవర్ణం, హరిత అంటే ఆకుపచ్చ, శ్యామ అంటే ముదురుపచ్చ. ఈ వర్ణాలకు ఐక్యము చెప్పవచ్చు అంటే కవి సమయాల ననుసరించి భేదం పాటించనవసరం లేదన్నమాట. అందుకే శ్యామసుందరుడు, నీలమేఘ శ్యాముడు కృష్ణపరమాత్ముడు అంటూ కృష్ణుని వర్ణించడం వుంది. చంపక, భ్రమరాలకు విరోధం వున్నట్లు, చక్రవాక దంపతులకు రాత్రివియోగం కలుగునట్లు, స్త్రీకి రోమావళి వున్నట్లు, సముద్రంలోనే మొసళ్లున్నట్లు, తామ్రపర్ణి నదిలో ముత్యాలు లభిస్తాయని వర్ణించాలి. ధ్వజము, చామరము, హంస, హారము, కొంగ, భస్మము వీటికి తెల్లదనమే వర్ణించాలి

అలాగే స్త్రీల కొన్నిచర్యలతో వృక్షాలకు సంబంధించిన విషయాలు కవిసమయాల్లో ప్రసిద్ధంగా వున్నాయి. పద్మినీజాతి స్త్రీ తన్నడంవల్ల అశోకవృక్షం పుష్పిస్తుందిట. వారు పుక్కిటబట్టి ఉమియడంవల్ల పొగడచెట్టు, వారి కౌగిలింతతో గోరంట, వారి చూపులుసోకి బొట్టుగుచెట్టు, వారు నర్మగర్భంగా మాట్లాడడంతో మందారం, వారి నవ్వుతో సంపెంగ, వారి ముఖానిలంతో మామిడిచెట్టు, వారి సంగీతంవల్ల సురపొన్న, వారి నర్తనంతో కొండగోగుచెట్టు వికసిస్తాయని 'కవి సమయం'. వసుచరిత్ర వ్యాఖ్యాత మాకందం స్త్రీల కరస్పర్శతో, సంపెంగ ముఖరాగంతో, ప్రియాళువు సంగీతంతో వికసిస్తాయని పేర్కొన్నాడు.

కవులు కాలౌచిత్యాన్ని పాటించి ఋతువర్ణం చేయాలనీ, ఏ ఋతువులో ఏయే విషయాలను ప్రస్తావించాలనేది కవిసమయాలు సూచిస్తుంటాయి. లోకంలో అవి నిర్ధారితాలుగా భాసిస్తూ వుంటాయి. అలాగే సంఖ్యానియమం కూడా వుంది. త్రికాలాలు, త్రిభువనాలు, త్రినేత్రుడు అంటాం. అలాగే తాంబూలగుణాలను త్రయోదశ సంఖ్యగానే చెప్పాలి. చంద్రుడివి పదహారు కళలు అంటారు. ఇలా కావ్యగత, ప్రబంధగత అంశాలుగా కవిసమయాలు కవుల రచనల్లో ప్రతిబింబితమవుతూ రావడం ఒక రచనా సౌందర్యంగా, భావాభివ్యక్తీకరణ సొబగుగా రాజిల్లుతోంది. ఇప్పుడు ఈ కవి సమయాలు అనేకం పాతబడినట్లు, ప్రయుక్తంలో లేనట్లు కావడానికి అసలు కవిత్వ రీతుల్లో పద్యరచనాఫణితి మందగించడమూ హేతువే. ఏమయినా పద్య వారసత్వాన్నీ, హృద్యమైన పద్యంలో కవిసమయాల సౌందర్యాన్నీ, సంరక్షించుకుంటే భాషలోని పెన్నిధులను సంరక్షించుకున్నట్లే.

# ‘రూఢివాచకా’ల మెరుగులు

**రూ**ఢివాచకం అనేది భాషలోని మరో సొగసు. ఒక పదానికి వాస్తవానికి వుండే అర్థం ఒకటి అయితే, జనవ్యవహారంలో మరో అర్థానికి రూఢిగా వాడబడుతూండడమే ఈ విశేషం. కాలక్రమేణా అర్థవిపర్యయం చెందేవి కొన్ని వుంటాయి. కానీ ఏ కాలానికయినా ఒక అర్థంలో రూఢిగానిలిచేవి మరికొన్ని వుంటాయి. అధ్వాన్నం అనే మాటను మనం ఇవాళ పనికిరానిది, బాగులేనిది, చెత్తగా వుంది అనే అర్థంలో వ్యవహరిస్తున్నాం. కానీ అధ్వము అంటే మార్గము. నిజానికి మార్గమధ్యంలో తినే అన్నం అధ్వాన్నం. మునుపు ఒక ఊరు నుంచి మరో ఊరు ప్రయాణిస్తూ దారిలో తినడానికి మూట కట్టుకువెళ్ళేవారు. అది అధ్వాన్నం, కానీ ఇవాళ ఆ పదం రూఢి వేరు.

రూఢివాచక శబ్దాలలో పురుష, స్త్రీ, వస్తు, జంతు రూఢివాచక పదాలు అనేకం వున్నాయి. ఏ పేరూ లేని వాడిని ‘అగస్త్యభ్రాత’ అంటాం. అగస్త్యుడి సోదరుడి పేరు తెలియదు కనుక అలా రూఢి అయింది. అలాగే వాడొక ‘కుంభకర్ణుడు’ అంటాం. కుంభకర్ణుడు రావణుడి సోదరుడు. ఆరునెలలు నిద్రపోతే, లేవగానే ఆకలి అంటాడు. అంచేత నిద్రముచ్చుకు కుంభకర్ణుడు అనే పదం రూఢివాచక శబ్దమయింది. అలాగే ‘వాడు నక్షత్రకుడు అనుకో!’ అన్న వ్యవహార వాక్యంలో నక్షత్రకుడు అంటే పట్టువిడువక వెంటబడేవాడు అని. అప్పు వసూలు చేయడానికి హరిశ్చంద్రుని వెంటబడిన నక్షత్రకుడు జనవ్యవహార భాషలో అలా రూఢిశబ్దమయ్యాడు. అలాగే తిండిపోతుని ‘బకాసురుడు’ అంటాం. ఇలా పురాణాల నుంచి రూఢివాచక శబ్దాలు గ్రహించడం జరిగింది. కానీ ఆధునిక కాలంలోనూ రూఢివాచక నామాలు ప్రముఖుల పేర్ల నుండి జన వ్యవహార భాషలో ప్రత్యేకార్థంలో స్థిరమవుతూనే వున్నాయి. ‘సూర్యకాంతం’ అనే పదం గయ్యాళి అన్న దానికి రూఢివాచకం అయింది. తెలుగు సినిమాల్లో సినీనటి సూర్యకాంతం స్వభావం అలా ఎదిగి భాషలోకి వచ్చింది. ‘అంతులే’ అంటే అంతులేని అవినీతికి స్థిరమైంది. అలాగే గొప్పగాపాడే లక్షణ వ్యవహారానికి ‘ఘంటసాల’ పేరూ నేడు భాషావ్యవహారంలో ఓ రూఢివాచకమయిందనవచ్చు.

పురాణాలలోనివి ఎన్నో పాత్రలు విశాల జన ప్రపంచం పరిధిలోనివి కనుక ఆ వాచక శబ్దాలు భాషలో ప్రత్యేకార్థంలో రూఢిగా ప్రయుక్తమవుతూంటాయి. గొప్ప బలశాలిని ‘భీముడు అనీ, కపటిని, దుష్టుడిని ‘శకుని’ అనీ పేర్కొంటాం. అర్జునుడికి గల ‘సవ్యసాచి’ అనే పదాన్ని రెండు చేతులతో పనిచేయగల సమర్థుడనే అర్థంలోనూ ప్రయుక్తం చేయడం

జరుగుతోంది. గురువు లేకనే కేవలం ఒకరిని లక్ష్యంగా గౌరవప్రదంగా పెట్టుకుని విద్యనభ్యసించేవాడిని 'ఏకలవ్యుడు' అంటాం. అలాగే స్త్రీ రూఢి వాచక శబ్దాల విషయానికి వస్తే గొప్ప అందగత్తెను 'రంభ' అంటాం. ఆమె ఇంద్రసభలోని నాట్యకత్తె. ఉగ్రురాలు, కోపస్వభావిని అయిన స్త్రీని 'భద్రకాళి' అంటాం. తంత్రము గల దుష్టబుద్ధి స్త్రీని 'మంధర'గా వ్యవహరిస్తాం. జానపద నాయిక అనగానే 'ఎంకి' అంటాం. ఆ 'ఎంకి'ని అలా రూఢివాచక శబ్దం చేసిన ఘనత కవి నండూరి సుబ్బారావుగారిదే. అలాగే చుప్పనాతిబుద్ధిగల దుష్టురాలుకు రూఢి వాచకపదం 'శూర్పణఖ' . తృప్తిగా అన్నం పెట్టే స్త్రీని 'అన్నపూర్ణ' అని భాషలో వ్యవహరించుతూ వుంటాం.

వస్తుగత రూఢివాచక శబ్దాలూ వున్నాయి. మిక్కిలి యోగ్యతను 'బంగారం' అనీ, దృఢ సంకల్పాన్ని 'ఉక్కు' అనీ భాషలో పదప్రయోగం చేసినట్లే, ఏమీ చేయని వాడిని 'చత్రాయి' అనీ, భారంగా పరిణమించినవాడిని 'గుదిబండ' అనీ వ్యవహరిస్తాం. కష్టాలు కలిగే తావుని 'నరకం' అనీ, సుఖప్రదేశాలను 'స్వర్గం' అనీ రూఢిగా పేర్కొంటాం. ప్రతిబంధకాలయిన వాటిని 'సంకెళ్ళుగా మారాయి' అంటాం. ముత్యం, రత్నం, వజ్రం, మణి ఇవన్నీ వ్యక్తుల యోగ్యతకు ప్రయుక్తం చేస్తూండే రూఢివాచక శబ్దాలే. కోర్కెలు తీర్చే స్వభావం వున్న వితరణిశీలిని 'కల్పవృక్షం'గా, 'కామధేనువు'గా పలుకుతాం.

ఇలాగే మానవ స్వభావంలోని వివిధ పార్శ్వాల, గుణాల ఉటంకింపునకు భాషలో వ్యవహరించే రూఢివాచక పదాలు అనేకం జంతుసంబంధులుగానూ ఉన్నాయి. పట్టుగలవాడిని ఉడుము అని, ఎలుగుబంటి అనీ, పంచతంత్రంలోని జంతు పాత్రలైన నక్కలని అతితంత్రము గలవారికి రూఢిగా 'కరటకదమనకులు'గా ప్రయుక్తం చేస్తారు. తెలివితక్కువవాడు 'పశువు'గానే రూఢి. గొప్ప ధైర్యశాలిని సింహం, పులితోనూ, అమాయకుడిని 'పిల్లి' పదంతోనూ, లోన సత్తా లేకపైకి గాంభీర్య ప్రదర్శన చేసేవారిని 'మేకపోతు' అనీ, కొంటె పనులు చేసేవాడిని కోతి అనీ, పీడించే స్వభావం కలవాడిని 'జలగ' అనీ, సాధుస్వభావుడినీ, పూజనీయుడినీ 'గోవు' అనీ, హానిచేసేవాడిని 'పాము' అనీ, 'తేలు' అనీ రూఢివాచక శబ్దాలతో వ్యవహారభాషలో ప్రయుక్తం చేస్తూంటాం. ఇవన్నీ ఉదాహరణకు వాచవిగా ఎంపికచేసి చెప్పిన రూఢివాచక శబ్దాలే గానీ భాషా సౌందర్యం పరికించినపుడు ఇలాంటి అనేకం ఎవరికి వారు పట్టుకోవచ్చు. రూఢివాచక శబ్దాలుగా ఇలా భాషలో మానవజీవన ప్రకృతి సంబంధులుగా వినియోగించే అర్థవంతమైన అద్భుత పద సంపద, ఆ వ్యవహారం–భాషలోని సొగసు కాదంటారా!

# ప్రత్యయాలతో ప్రసన్నత

**భా**షలోని సొబగులను వివరించడానికి ఒకప్పటి రోజుల్లో పాఠశాలల్లోనూ, ఇంట్లోనూ కూడా– పెద్దలు క్రీడల వలెనే మాటల ఆటలాడించేవారు. పద సంపదను పెంచుకోవడానికీ, అందంగా అర్థవంతంగా మాటలాడు కోవడానికీ ఆ వైఖరి పిల్లలకు వ్యవహారంలో ఎంతగానో సహకరించేది. హారము అన్నమాటే తీసుకోండి. ఆ పదానికి ముందు మరి ఒక అక్షరమో, కొన్ని అక్షరాలో చేరుస్తూ పద సంపదను గ్రహించడం విద్యార్థులకు ఓ ఆట. హారము, ఆహారము, విహారము, సంహారము, సమాహారము, ప్రహారము, భాగాహారము, ఉపహారము, వ్యవహారము, నీహారము అంటూ వివిధ పదాలుగా విస్తరించినట్లే కారము, ఉపకారము, మమకారము, అపకారము, గుణకారము, అధికారము, అంధకారము, పరోపకారము, సాకారము, ప్రాకారము, సహకారము అంటూ ఎవరు ఎన్ని పదాలను గ్రహించగలరనేది వారికి భాషపై, పద సంపదపై గల పట్టుననుసరించి తెలుసుకోవచ్చు. భాషావిషయకమైన ఇలాంటి క్రీడలు మాటలుగా, రాతలుగా విద్యాలయాల్లో తరగతిగదిలో వినియోగిస్తుంటే తెలుగు భాష తేజరిల్లదా! ఈ తరానికి అందుబాటులోకి రాకమానుతుందా?

ఎటు చదివినా అర్థం మారని పదాలున్నాయి. 'కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్' అన్నాడు కవి. కుడినుండి ఎడమకు చదివినా, ఎడమనుంచి కుడికి చదివినా అర్థం మారని పదసంపద భాషలోని ఒక సొగసు, వికటకవి అనే పదాన్ని ఇలాంటి పదంగా అందరూ ప్రాథమికంగా పేర్కొంటూ వుంటాం. మిసిమి, కిటికి, నల్లన, పులుపు, సంతసం, కనక, కునుకు, సరస, జలజ, నటన ఇలాంటివి కొంత విస్తరించి–కట్టకట్టక, వినమని మనవి వంటివి కూడా అలాంటి సొగసు గలవని గమనించారా మరి. మందారదామం, పాలునలుపా, కడపలో పడక, నీ పంచనే చంపనీ, రంగనగరం, పంచాస్త్రచాపం, నేతచేతనే ఇలా గ్రహించదగిన పదాలు ఎన్నో వున్నాయి. మాటలాడుకునేప్పుడు ఇలాంటి పద ప్రయోగాలు అర్థవంతంగా ప్రయుక్తం చేసినపుడు వినేవారికి ఆసక్తిదాయకంగా వుండడమే కాదు, వక్తలోని ప్రతిభకు, సరసతకు భావపటిమకు దోహదపడేవిగా ఇటువంటి మాటలుంటాయి. ముందువెనుకలొకటేగా ఈ పదాలు అందాలొలికిస్తాయి.

'జంబీరబీజం', 'రా మాకురా రాకుమారా', 'నటన' 'కడనడక', 'ముత్యము'వలె 'సంతనం' కలిగిస్తూ 'మడమ' తిప్పని భాషా సౌందర్యానికి 'జేజేలేజేజే'గా భాసిస్తుంటాయి.

పిల్లలు ఇటువంటివి పలికినప్పుడు అది 'నందనందనం'. వినేవారికి ఆనందస్యందనం.

మునుపు మనం జంటపదాలు గురించి చెప్పుకున్నాం. ఒకే పదం మళ్లీ వెంటనే పునరుక్తమవుతూ మానవస్వభావ భావప్రతీకంగా భాషలో సొబగులీనుతున్న వాటిని గురించి ఇక్కడ ప్రస్తావించుకుందాం. చరచర అనేది గబగబ అనేది వేగవంతమైన నడకకు ప్రయుక్తమౌతున్న అలాంటి పదాలే. కణకణ, భుగభుగ, భగభగ అనేవి మంటకు, సలసల అనేది క్రాగుటకు, జరజర అనేది ప్రాకుటకు, పటపట అనేది పళ్లు కొరుకుతూ వ్యగ్రతా సూచనకు వినియోగిస్తుంటాం. వడవడ, బడబడ అనేది మాట్లాడడంలోని వేగిరానికి దూకుడుకి సంకేత పదాలు. తళతళ, ధగధగ మెరుపుకు, నకనక ఆకలికి, గలగల గాజుల చప్పుడుకూ, నది పారుదలకూ, కరకర నమిలి మ్రింగడానికి, వలవల ఏడుపుకు, లబలబ మొత్తుకోవడానికీ, మలమల మాడడానికీ ఉపయుక్తమయ్యే అర్థవంతమైన పదాలుగా ధ్వనిమంతంగా వ్యవహరిస్తుంటాం. చినుకులు టపటప రాలుతాయి. డోలు డమడమ మ్రోగుతుంది. భయంవల్ల గడగడలాడడం, చలికి గజగజలాడడం జరుగుతుంది. తలుపు దబదబ బాదడం, హరహర అని భగవన్నామ స్మరణం చేయడమూ వుంది. భాషలోని పదసౌందర్య వైవిధ్యంలో ఇవన్నీ విస్తృతపార్శ్వాలే. ఈ సొబగు మనభాషలోనే అధికంగా కనిపిస్తుంది. వీటన్నింటితో పరిచితి తెలుగులో మాట్లాడుకోవడం, రాయడం జరుగుతున్నప్పుడే కలిగి నిలబడుతుంది. మాటలఅందాలు మాట్లాడుకుంటేనే కదా తెలిసేది. వ్యవహారంలో చ్యుతమైపోతున్న ఇటువంటి భాషలోని సొగసులను నిలుపుకోవడం అనేది భాషాప్రేమికుల కర్తవ్యం.

# అటొక అర్థం.. ఇటొక అర్థం

'**కు**డి ఎడమైతే పొరపాటు లేదోయ్' అన్నాడు కవి. తెలుగుభాషలో కొన్ని పదాలు కుడినుంచి చదివినా, ఎడంనుంచి చదివినా ఒకే అర్థం ఇచ్చి పొరపాటు అనిపించవుగానీ, ఈ సూత్రం అస్తమాను వర్తించదు సుమండీ! కుడినుంచి చూస్తే ఒక అర్థం, ఎడమ నుంచి చూస్తే మరో అర్థం. అంటే 'అటుఇటు అయితే' వేరు అర్థాలు ఇచ్చే అందమైన పదాలూ భాషలోని సొగసే! కుడిచేత్తో అన్నం తింటూ అద్దంలో చూసుకుంటే ఎడంచేత్తో తిన్నట్టు వుంటుంది కదా! అలా అద్దంలో అర్థం తారుమారైనట్లు, పదాల అర్థమూ పసందుగా మారిపోయే పదసంపద మనకుంది.

రమ అంటే లక్ష్మీదేవి. ఆవిడని యంత్రంగా మార్చేసేయాలంటే రమ తిరగేసి మర అనాలి. వాల్మీకి బోయవాడుగా వున్నప్పుడు అతడిని మార్చడానికి నారదుడు అతగాడి నోరు తిరగడానికి వీలుగా 'మరా మరా' అనమని మంత్రోపదేశం చేసాడనీ, 'మరామరా' అని పదేపదే బోయజపిస్తూ, అది 'రామ రామ'గా మారి, రామ మంత్రోచ్ఛారణతో తపస్సిద్ధి పొంది, గొప్ప కవిగా మారి, రామాయణ మహాకావ్యాన్ని మనకందించాడనీ కథనం ఉంది.

నది దగ్గరకు వెళ్లి 'కనుము' అంటే సరిపోదు–తిరగేసి మునుక వేస్తేనే నదీస్నానం చేసినట్లు మరి! తల తిరిగిందనుకోండి–అది లత అయిపోతుంది. శ్రీశ్రీ గారు ఓసారి 'తల తిరిగిన రచయిత్రి' అని ఓ నవలా రచయిత్రి స్వభావాన్ని కూడా ధ్వనింపజేశారు. ఒకరిపై కోపం వస్తే 'కరచు' స్వభావం ప్రకటించక్కర్లేదు. మాటల్లోనే 'కరచు'ను తిరగేసి 'చురక' వేస్తే చాలుగా!

'పడక'పోతే బాంబు తిరగేస్తారు. అదేకదా మరి! సినిమాలు సీమప్రాంతం 'కడప'కు సీమితం చేసిన భావజాలం, పడక తిరగేసేది కడప! అలాగే 'పడగ' అటుగా ఎత్తి 'గడప' దగ్గర కన్పించవచ్చు. అది 'కలప'తో చేసింది–చెక్కది అనుకుందామనుకున్నప్పుడు నాలుగువైపులా చెక్క చక్కగా వున్న 'కలప' తిరగేస్తే 'పలక' అయిపోతుంది.

ఇలా అటొక అర్థం, ఇటొక అర్థం ఇచ్చే పదాలు భాషకు సొగసుల పరమార్థం! 'పంచె అన్నది నిజానికి భారతీయ పురుషుడి ఒక సంప్రదాయ దుస్తు. 'పంచె' అటుగా 'చెంప' అయి, క్రింద ఉడుపు కాస్తా పైన ఓ నేత సానుభూతి యాత్రలో తడిమేది

అయిపోవచ్చు. 'తడుము' అనేది తడుముతున్నప్పుడు అటుగామరి 'ముడత' వచ్చేస్తుంది సుమండీ!

కాళ్లూ మొదలైన ఎడముగా సాగిన 'శాఖ'కు 'పంగ' అనే వ్యవహారం వుంది. 'పంగ' అటుగా 'గంప' అయిపోతుంది. గంపలో నింపుకునేవి బోలెడుంటాయి. బాపురే అని ఆశ్చర్యార్థక పదంగా వాడతాం. కాని అది 'పురే' అనే మూలరూపంగా వున్నదే. 'పురే' అనే పదం ఆశ్చర్యార్థకంగానూ, నిందార్థకంగానూ, ప్రశంసార్థకంగానూ కూడా కవులు ప్రయోగించారు. "చాలున్ బురే నరేశ్వరా! ప్రచండతరంబగు నిట్టి సాహసంబేల యొనర్చెదీవు" అని హరిశ్చంద్రోపాఖ్యానంలోని పద్యంలో 'పురే' నిందార్థకంగా వాడింది! ఇంతకీ తమాషాగా ఈ'పురే' అటుగా వస్తే 'రేపు' అయిపోతుంది. ఇంగ్లీష్‌ది కాదండీ బాబూ! ఇవాళ తర్వాతదీ, ఎల్లుండికి ముందుదీ అయిన 'రేపు'. నేడు కాక మరుసటి దినమన్నమాట. తృణకాండము, సన్ననిపుల్ల, కట్టెపుల్లను 'పుడుక' అంటాం. ఆ 'పుడుక' పదం అటుగా 'కడుపు' అయిపోతుంది.

విలాస విశేషాన్ని 'గునుపు' అంటాం. పిల్లలు మురిపెంగా గునుస్తూ వుంటారు కదా! అదే 'గునుపు'. ఆ గునుపు పదం అటుగా 'పునుగు' అయి కూర్చుంటుంది. పునుగు పిల్లి గంధసారాన్నే మరి వేంకటేశ్వరస్వామి అర్చనలో నేటికీ తిరుపతిలో వినియోగిస్తుంటారు. పునుగు గురించీ గునుపు వుంది మరి!

'గెంతు' అని అంటూంటారు కానీ, అసలుకి 'గంతు' అనేది పదం. 'గంతు' అంటే ప్లుతగతిభేదం, దాటు, దుముకు అని అర్థాలు. ఆ 'గంతు' అటుగా 'తుంగ' అయ్యి, ఓ చెట్టుగా మారిపోతుంది. టపటప చినుకులు రాలుతాయి గానీ, ఆ పదం కుడివైపుగా 'పటపట' చేస్తే–పళ్లు కొరకడం అవుతుంది. 'కటకట' వేరు 'టకటక' వేరు. 'పీపా' అటుగా 'పాపీ' అవుతుంది. నేతి మిఠాయి 'నేతి' అటుగా 'తినే'దవుతుంది. ఇలా అటొకఅర్థం ఇటొకఅర్థంగా భాషలో మాటల తికమకలు ఒక సొగసుగా అందాలొలికిస్తూ అలరిస్తూంటాయి. అందుకొని, మందహాసాలు చిలికించుకోండి మరి.

# పర్యాయపదాలు సొబగే కాదు.. ఒదుగు కూడా

**తె**లుగు చాలా సంపద్వంతమైనభాష అనడానికి ఒకపదానికి అనేక పర్యాయపదాలు వుండడమే గొప్ప నిదర్శనం. భాష మీద పట్టు సాధించాలంటే, వాడిన పదం మళ్లీ వాడకుండా, ఒక అంశం గురించి వివరించాలంటే పర్యాయపదాలు గొప్పగా దోహదపడతాయి. అయితే ఒకే అర్థం ఇచ్చే పదమే అయినా సమయం, సందర్భం బట్టి ఆ పద ప్రయోగం చేయడంలోనే ప్రసంగకర్త మాటకారితనం, రచయిత అభివ్యక్తి విన్నాణం దాగి వుంటాయి. మగవాడు, పురుషుడు, మనుష్యుడు అని మగవాడికి పర్యాయపదాలు వుండడంతో పోలిస్తే–భాషలో స్త్రీకి వున్న పర్యాయపదాలు చూస్తే అనేకంగా కనిపిస్తాయి.

స్త్రీ అనే అర్థంలో అంగన, అంచయాన, అంబుజలోచన, అంబుజవదన, అంబుజాక్షి, అంబుజానన, అంబురుహాక్షి, అక్క, అతివ, అన్ను, అన్నుష, అన్నువు, అబల, అబ్జనయన, అబ్జముఖి, అలరుబోడి, అలివేణి, ఆడది, ఆడకూతురు, ఇంతి, ఇందీవరాక్షి, ఇందునిభాస్య, ఇందుముఖి, ఇందువదన, ఇగురుబోడి, ఇభయాన,ఉగ్మలి, ఉవిద, ఉజ్జ్వలాంగి, ఎలనాగ, ఏతుల, కంజముఖి, కంబుకంఠి, కనకాంగి, కమలాక్షి, కలకంఠి, కలశస్తని, కలికి, కాంత, కువలయాక్షి, కేశిని, కొమ్మ, కోమలి, కోమలాంగి, చంద్రముఖి, చంద్రవదన, చక్కనమ్మ, చాన, చామ, చారులోచన, చిగురుజోడి, చిలుకలకొలికి, చెలువ, చేడె, తన్వంగి, తన్వి, తమ్మికంటి, తరళేక్షణ, తరుణి, తలిరుబోడి, తలోదరి, తొయ్యలి, తోయజాక్షి, దుండి, ననబోడి, నళినాక్షి, నవలా, నాతి, నారి, నీరజాక్షి, నీలవేణి, నెలత, నెలతుక, పంకజాక్షి, పడతి, పడతుక, పల్లవాధర, పాటలగంధి, పుత్తడిబొమ్మ, పూబోడి, పైదలి, పొలతుక, ప్రమద, ప్రియ, బింబాధర, బింబోష్ఠి, బోటి, భామ, మగువ, మహిళ, మదిరాక్షి, మానిని, మానవతి, ముగుద, ముదిత, ముద్దుగొమ్మ, మెలత, యోష, రమణి, రూపసి, లతాంగి, లలన, లేమ, వనిత, వలజ, వారిజనేత్రి, వాల్గంటి, విరిబోడి, విశాలక్షి, వెలది, శంపాంగి, శాతోదరి, సుందరి, సుగాత్రి, సుదతి, సునయన, హంసయాన, హరిణలోచన, ఓహ్!... ఎన్నో వదిలేసానుగానీ ఇలా స్త్రీకి పర్యాయపదాలు అపారంగా వున్నాయి.

వృద్ధురాలుకు జరతి, పలిక్ని, మందాకిని, ముదుసలి, ముద్ది, వృద్ధ, అవ్వ వంటి పదాలున్నాయి. అయితే ఏ పదం ఏ సందర్భంలో ఎలా ఔచితీమంతంగా, అర్థవంతంగా ప్రయోగించి మాట్లాడాలో, రాయాలో తెలుసుకోవాలి. ఒక బిడ్డను మాత్రమే కన్న స్త్రీని కాకవంధ్య అని ఒకప్పుడు అనేవారు. దూషిత, హత అంటే కన్యాత్వము చెడినది అనీ, భర్త, పిల్లలు గతించిన స్త్రీని నిర్వీర అనీ, మారుమను వాడిన స్త్రీని పునర్భువు అనీ, పిల్లలు కలగని స్త్రీని గొడ్రాలు, అప్రజాత, అశిశ్వి, గొడ్డురాలు, బందకి, పంజ, వంధ్య, వృషలి, శూన్య అంటారు. గర్భవతియైన స్త్రీని అంతరాపత్య, అంతర్గర్భ, ఉదరిణి, గర్భిణి, గుర్విణి, చూలాలు, దౌహృదిని, నిండుమనిషి, భ్రూణ, ససత్త్వ, సూష్యతి, వ్రేకటిమనిషి అని పేర్కొనడం వుంది. అలాగే బాలెంతరాలు అయిన స్త్రీని జాతాపత్య, నవప్రసూత, పురుటాలు, పురుటియాలు, ప్రజాత, ప్రసూత, ప్రసూతిక, బాలెంత, బిడ్డతల్లి, సూతక, సూతి అని పేర్కొంటారు. ఇలా స్త్రీకి వివిధ దశల్లో కూడా పేర్కొనబడే అర్ధసూచక పదాలు అనేకం వున్నాయి. ఆత్రేయి, ఉదక్య, ఏకవస్త్ర, త్రిరాత్ర, నెలబాల, స్త్రీధర్మిణి అంటూ ఋతుమతి అయిన స్త్రీకి పర్యాయపదాలున్నాయి. పర్యాయపదాలు గురించి చెప్పడానికి వాచవిగా తీసుకున్నదే ఇది. ఒక స్త్రీకే తెలుగు భాషలో ఇన్ని పర్యాయపదాలు వ్యవహారంలోకి వచ్చాయంటే, మనభాష ఎంత సంపద్వంతమో తెలియడంలేదా? పర్యాయపదాలు అని చెప్పుకుంటున్నాం కదా అసలు ఈ పర్యాయము అన్న పదానికే తడవ, అనుకల్పము, ఆవర్తి, ఆవృత్తి, తూరి, దఫా, పరి, పరువడి, పారి, పూపు, మఱి, మాటు, మాఱు, మొగి, రువ్వము, రువ్వ, విడుత, సారి అనే పర్యాయపదాలున్నాయి తెలుసా! నిజానికి పర్యాయపదాలకు ఒక నిఘంటువే పూర్తిగా రూపొంది వుంది. ఆచార్య జి.ఎన్.రెడ్డిగారు పర్యాయ పద నిఘంటు నిర్మాణం ఒకటి చేసి, ముఖ్యంగా యువతకు అందుబాటులోకి తెచ్చారు.

సమానార్థకాలుగా గానీ, సన్నిహితార్థాలుగా గానీ వుంటూ, రూపభేదంతో ఉండేవి పర్యాయపదాలు. సమానార్థకాలైనందువల్లనే కాకుండా అర్థచ్ఛాయల్లో ఉండే సూక్ష్మతర భేదాల్ని తెలుపడానికి కూడా ఈ పదాలు ఉపయుక్తంగా వుంటాయి. పూర్తి సమానార్థకాలు కొన్నయితే, పాక్షిక సమానార్థాలుగా కొన్ని వుంటాయి. ఈ పర్యాయ పదాలనేవి అభివ్యక్తి సామర్థ్యాన్ని బట్టి మాటల్లో, రచనల్లో వీటిని ఉపయుక్తం చేసి సొబగు చూపుకోవలసింది మనమే.

# ప్రాసాక్షరాలు భాషకు ఆభరణాలు

ఏమిటోయ్ సుబ్బారావూ ఏంచేస్తున్నావూ
పనిచేస్తే గానీ నువ్వు తగ్గవోయ్ లావూ
వొళ్లొంచి సరిగా పనిచేయకపోతే నీవు
వేరేచోటికి తప్పక బదిలీ అవుతావు!

అంటూ ఓ ఆఫీసర్‌గారు తన క్రిందిఉద్యోగితో అన్నారట. సరిగా పనిచేయకపోతే నీకు ట్రాన్స్‌ఫర్ తప్పదు అన్న హెచ్చరికనే ఆయన చేసినా, సుబ్బారావుతో ఆయనలా మాటాడుతున్నప్పుడు అందరూ నవ్వేస్తారు. సుబ్బారావుకు కూడా తగలాల్సినచోట ఆ హెచ్చరిక తగుల్తుంది కానీ– మామూలుగా తిడితే వచ్చే కోపమో, ఉక్రోషమో అంతగా రాకపోవచ్చు. మన భాషలోని సొగసులో ప్రాసభాషణం ఒకటి. అంత్యానుప్రాసతో మాట్లాడడం కొందరికి అలవాటు. అందులో ఆ అందం వుంది. ప్రాస అతి అయితే ఆ కుతికి మతిపోయినట్లయి వెగటూ కలగవచ్చునుకోండి, అది వేరు రీతి.

ప్రాస అనేది ఒక ఆలంకారిక ధోరణి. ఛందోబద్ధ పద్య రచన చేయడానికి అనివార్యంగా యతి, ప్రాసల గురించి తెలిసి వుండాలి. పద్యపాదంలో రెండవ అక్షరం ప్రాసస్థానంగా నాలుగుపాదాల్లోనూ నియతిగల రచనా విధానం కావ్యాల్లోనూ కనిపిస్తుంది. ప్రబంధకాలం గతించి ఆధునికయుగంలోనూ గేయకవిత్వంలో ప్రాస సంవిధానం సొబగులున్నాయి.

వచన కవిత్వం వచ్చాక కూడా వచనకవితా పితామహుడు అనిపించుకున్న కుందుర్తి ప్రాసలకు ముఖ్యంగా అంత్యప్రాసలకు చోటిచ్చారు. అసలు కవిత్వం అంటే ప్రాసయుక్తంగా వుండడమనే భావన వున్నవారూ వున్నారు. అలా ప్రాసలతో సంభాషణల్లో అలవోకగా మాట్లాడే వారిని 'కవిత్వం చెపుతున్నాడురోయ్' అనుకోవడమూ వుంది. ఆగ్డన్‌నేష్ అనే ఆంగ్లకవి ప్రభావంతో ఆరుద్రరాసిన 'ఇంటింటి పజ్యాలు' హాస్య చమత్కారాల వల్లనే కాదు, ప్రాస పలుకులవల్లా మనోజ్ఞంగా భాసించాయి.

కుందేలు తాబేలు వేసుకున్నాయి పందెం
గుట్టుగా చెబుతా తాబేలు గెలిచిన చందం
కుందేలు మారింది రెండు రైళ్లు
తాబేలు నడిచింది వందమైళ్లు

అంటూ ఆరుద్ర భారతీయ రైల్వేలకు సమయపాలన లేకపోవడాన్ని పరిహాసం చేస్తూ ఇంటింటి పజ్యాల్లో రాసాడు. పందెం, చందం, రైళ్లు, మైళ్లు అనే ప్రాస పదాలు ఎంత భావస్ఫూర్తిని కలిగించాయో తెలుస్తూనే వుంది కదా!

ప్రాసల ప్రయుక్తం ఉపన్యాసకళలో ప్రేక్షక జనరంజకత్వానికి ఎంతగానో ఉపకరిస్తుంది. డా.సి.నారాయణరెడ్డి ప్రసంగాలలో ఒకప్పుడు ఈ ఝరి బాగా వుండేది. క్లాసులో విజయవిలాసం పాఠం చెబుతూ 'సవ్యసాచి ఇంద్రోపలరోచి చూచి, తలయూచి ఉలూచి రసోచితంబుగన్' అంటూ అరు'చి'లతో ఆర్చికట్టాడు అంటూ పాఠం చెప్పి అలరించేవారు ఆయన.

తిరుపతిలో అనుకుంటా ఒకాయన పేరే ప్రాసమణి. ఆయన మాట్లాడుతూంటే ఆశువుగా ప్రాసపదాలు అలా ఔచితీమంతంగా అర్థవంతంగా దొర్లుకుంటూ వస్తాయి.

సినిమాలలో పాత్రలకుకూడా ఈ సంభాషణా ధోరణిపెట్టి హాస్యం పండించిన సన్నివేశ కల్పనలు అనేకం కానవస్తాయి. 'మళ్ళీ మళ్ళీ జరగాలి చెల్లి పెళ్ళి' అంటూ తనికెళ్ళ భరణి, అలాగే జంధ్యాల చిత్రాలలో సుత్తి వీరభద్రరావు, శ్రీలక్ష్మి వంటి పాత్రధారుల చేత ఇలాంటి ప్రాసభాషణలు హాస్యసన్నివేశాలుగా రాణకెక్కాయి. మాట్లాడుతున్నప్పుడు వాక్యాల చివరిఅక్షరాలు ప్రాసపదాలుగా భాసించే తీరు ఒకటయితే, ఒకటే అక్షరాన్ని చివరనగల పదాలను వరుసగా అర్థవంతంగా ప్రయోగిస్తూ మాట్లాడటం ఒక పద్ధతి. "కిట్టు బెట్టు చేయక విట్టువేసినా రట్టు కాకూడదని ఆ పట్టున పెసరట్టు తింటూ ఒట్టు పెట్టుకు మరీ గట్టున కూర్చుని చెట్టు చుట్టూ చీమల్ని మట్టుపెడుతూ తిట్టుకున్నా పట్టుదలతో సంభాషణతో ఆకట్టుకున్నాడు" అంటూ మాట్లాడటం ఓ తరహా. ఇది ఓ తరహా అయితే, 'కాకీకకాకికి కాక కేకికా' అనో, 'నానీనానీ నీ నాను నూనెను నానెనని నేనన్ననా' అంటూ ఏకాక్షర ప్రయుక్తంగా మాట్లాడడం మరో తరహా! వీటి తీరులో భాసించేది ప్రాసలహాసమే!

ఈ ప్రాసభాషణా సంవిధానం యాంకరింగ్ అనబడే వ్యాఖ్యానాల్లో జనరంజనం చేయగలుగుతుంది. అయితే దానికి సద్యఃస్ఫూర్తి, సమయోచిత నైపుణి ఉండాలి.

సాలూరు రాజేశ్వర్రావ్–రసాలూరు రాజేశ్వర్రావ్, ప్రజ్ఞామతి భానుమతి వంటి– సరస ప్రయోగాలు వ్యాఖ్యానంలో అందాన్ని తెచ్చినవే. ప్రాసకు అలంకార శాస్త్రంలో శబ్దాలంకారంగానే గుర్తింపు ఎక్కువ. ప్రాసలో అనుప్రాసము అంటూ ఛేకానుప్రాసము, వృత్త్యానుప్రాసము, లాటానుప్రాసము, అంత్యానుప్రాసము అంటూ భేదాలు చెప్పబడ్డాయి. రసానుగతమగు ప్రకృష్టమగు వర్ణవిన్యాసము అనుప్రాసము అని నిర్వచింపబడింది. రెండేసి

హల్లుల జంటలను అనేక పర్యాయాలు పద్యంలో చెప్పటం ఛేకానుప్రాసమనీ, ఆ రెండేసి హల్లుల జంటలో స్వరసాదృశ్య నియమము అనుషంగి కమేననీ నిర్వచింపబడింది.

ఒక్క వర్ణంబు కడదాకా నుద్ధరింప
బరస జృంభణ వృత్త్యనుప్రాసమయ్యె

అనీ, సుమద విపక్ష శిక్షణ విచక్షణ! దక్షిణ దోరనుక్షణ అంటూ ఉదాహరణగా 'క్ష'కార ఆవృత్తి పద్యం చూస్తాం. సాహిత్యదర్పణంలో అనుప్రాసము ఛేక, వృత్తి, శ్రుతి, అంత్య, లాటానుప్రాస అని అయిదువిధాలుగా చెప్పబడింది. యమకము, ముక్తపదగ్రస్తము అనే అలంకారాలు కూడా ఇలాంటి అందంతో కూడినవే. అనుప్రాస, యమకాలను కావ్యంలో ప్రయోగించే విషయంలో ధ్వనికారుడైన ఆనందవర్ధనుడు ప్రయత్నసాధ్యమగు నను్రపాసము కాక, అయత్నకృతమగు అనుప్రాసము రసపుష్టినిస్తుందని చెప్పాడు.

'ప్రాసకోసం చూసుకున్నా పాసిదానా!" అన్నట్లుగా కాక, ప్రజ్ఞతో అయత్నంగా జరిగే ప్రాసభాషణం సహృదయ హృదయైకవేద్యమై రాణిస్తుంది. రసహాస భాసమానం ప్రాస. రసాభాస కాకుండా ప్రాసభాషణం భాషలోని సొగసే. అదొక విన్నాణం.

# ప్రహేళికలతో భాషకు జోరు

ఇచ్చిన ఆధారాలను బట్టి పదాన్ని కనుక్కుని అడ్డం, నిలువుగళ్లను పదాలతో పూరించే క్రీడ 'క్రాస్‌వర్డ్ పజిల్'గా మొట్టమొదట 1913వ సంవత్సరంలో న్యూయార్క్ నుండి వెలువడే 'న్యూయార్క్ వరల్డ్' పత్రిక ఆర్డర్ వ్విన్నే అనే రచయిత రూపొందించగా ప్రచురించింది. ఆదివారం అనుబంధంలో దానికి అనూహ్యమైన ఆదరణ లభించింది. ధారావాహికంగా పది సంవత్సరాలపాటు క్రాస్‌వర్డ్ పజిల్ అనే గళ్ళనుడికట్టును ప్రచురించిన తొలి పత్రిక 'వరల్డ్' మ్యాగజైనే. 1924లో గళ్ళనుడికట్టు నింపేందుకు పనికొచ్చే ఓ నిఘంటువును ఒక ప్రచురణ సంస్థ వేయగా, రెండుమూడు వారాల్లోనే ఆ ఒక్క పుస్తకం అమ్మకాలపై ఆ రోజుల్లోనే లక్షలు లక్షలు ఆదాయం లభించింది. 1924లో 'లండన్ టైమ్స్' దినపత్రిక ఇదొక వ్యసనం అనీ, దీనివల్ల అనేక పనిగంటలు వృథా అవుతున్నాయనీ ఘాటైన వ్యాసం రాసింది. ఈ పజిల్స్ నింపే ధోరణి ఇంగ్లాండుకు ప్రాకింది. 1930లో ఇంగ్లాండులో గళ్లనుడికట్టులు నింపే నిఘంటువులు దాచేయడం, నిఘంటువు అయిదునిముషాలకు మించి చూడరాదని నిబంధనలు పెట్టడం, నిషేధించాలని ప్రయత్నించడం వరకూ కూడా వచ్చింది.

తెలుగులో ఈ క్రాస్‌వర్డ్ పజిల్ గళ్లనుడికట్టుని మొదటగా పేనింది శ్రీశ్రీయే. ఆయనకన్నా ముందుగా పేరు జ్ఞాపకం రానివాళ్లు పజిల్స్ చేసారు. శ్రీశ్రీ కూడా పదబంధ ప్రహేళిక అన్నాడు. ఐతే గళ్లనుడికట్టు అనే పేరు పెట్టింది మటుకు ఆరుద్రగారట. నిజానికి తెలుగులో మొదటి క్రాస్‌వర్డ్ పజిల్ 'శ్లిష్టాక్షర పదబంధం' పేర భారతిలో రెండు సంచికల్లో వెలువడింది. అయితే అది ఒక పద్ధతిలో లేకపోయింది. తర్వాత శ్రీశ్రీ చక్రపాణిగారి మాసపత్రికలో ఈ పదబంధాన్ని ప్రహేళిక పేర ప్రారంభించి ఆ తరువాత జ్యోతి మాసపత్రికలో చాలాకాలం నడిపాడు.

ఇవాళ్టికీ గళ్లనుడికట్టు మీద పాఠకుల ఆసక్తి తగ్గలేదు. అనేక దిన, వార, మాసపత్రికల్లో ఈ గళ్ల నుడికట్టులు రకరకాల పేర్లతో వస్తూనే వున్నాయి. ఎందరో

ఆసక్తిగా నింపుతూనే వున్నారు. వాటికి పుస్తక బహుమతులు, నగదు బహుమతులూ అందిస్తున్న పత్రికలూ వున్నాయి.

భాష మీద పట్టు సాధించడానికీ, పదాలెన్నింటినో తెలుసుకోవడానికీ, అలాగే రాజకీయ సాంఘిక వర్తమాన అంశాలతో ముడిపడివుండటానికీ గూడా గళ్ల నుడికట్టులు దోహదపడుతున్నాయి కనుక భాషలోని సొగసు క్రీడగా రాణిస్తున్నాయి. పదరంగం, పదనిసలు, పదగారడి, పదమవ్యూహం, పజిలింగ్‌పజిల్, మాటల కోట, పదరసం, పదచదరంగం, పదకేళి–ఏ పేరున అయితేనేం గళ్లనుడికట్టు ఎందరినో ఆకట్టుకుంటోంది. తమ మేధను వృద్ధాప్యంలోనూ చురుకుగా వుంచేందుకు, జ్ఞాపకశక్తిని నిలిపేందుకు, కుతూహలంగానూ, ఉపయుక్తంగానూ గళ్ల నుడికట్టులుంటున్నాయని కాళీపట్నం, త్రిపుర, చేరా వంటి ప్రముఖరచయితలు సైతం అన్నారు. స్త్రీ బాల వృద్ధులెందరికో ఇదొక భాషాక్రీడ.

ఆధారాలు అనేవే గళ్లనుడికట్టుకు మూలం, ఆధారాలు ఎంత ఎక్కువ తికమకపెడితే, ఆలోచనలకు పదునుపెడితే అంత రంజు, అంతేకాదు ఆ వంకన నిఘంటువులను తిరగవేయడం, పెద్దలతో సంప్రదించడం, సామాజిక వ్యవహారాలను, వార్తలను మననం చేసుకోవడం జరుగుతూ వుంటుంది. 1945 జూలైలో పజిల్ పేర శ్రీశ్రీ ఆంధ్రజ్యోతి మాసపత్రికలో తెలుగులో మొదట మొదలెట్టాడు. పదకొండు నెలలు వేసాడు. తర్వాత 1970 ఆగస్టులో జ్యోతి మాసపత్రికలో గళ్లనుడికట్టు 'పదబంధ ప్రహేళిక' పేర దాదాపు పదమూడేళ్లు నిర్వహించాడు. శ్రీశ్రీ స్ఫూర్తితో ఎందరో తెలుగులో గళ్ల నుడికట్టులు మొదలెట్టారు. ఇప్పటికీ కూరుస్తున్నారు. నుడికట్లకు ఆధారాలివ్వడంలోనే కూర్పరి నైపుణ్యం వుంటుంది. పాఠకులను వారు పెట్టే తికమకలు సరదాగా వుంటాయి. ఒక్కోసారి నేరుగా పదం కనుక్కునేందుకు వీలుగా సమానార్థక పదాన్నో, సూచనాత్మక పదాన్నో ఇస్తూంటారు. ఆధారాల్లో పటుత్వం వుండాలి, అడ్డం గళ్లలోని ఓ అక్షరం– మరో నిలువు గడులలో నింపబోయే పదానికి జతపడేదిగానో లేక నిలువు గడుల్లోని పదం నుండి ఓ అక్షరంతో– అడ్డంగడి పదం మొదలవ్వడమో అలా గళ్లు నింపడానికి దోహదకారిగా ఉంటూండడం ఆ గళ్ల నుడికట్టుల్లోని వైఖరి.

'పిల్లిలేని పినతల్లి వికారంతో కూడితే గరుత్మంతుని తల్లి' అన్నట్లుగా ఆధారం వుంటుంది. ఇది శ్రీశ్రీ ఇచ్చిన ఓ ఆధారం. పినతల్లిలో పిల్లి లేకుంటే నత అయింది. అది 'వి'కారంతో కూడితే వినత అయింది. గరుత్మంతుని తల్లి పేరు వినత కదా! అలా ఆ

ఆధారంతో గడిలో 'వినత' అనే పదం రాయాలన్నమాట. ఈ పదం అడ్డంలో నింపగా, రెండో అక్షరం 'న'తో మొదలయ్యే మూడుగడులతో మరో పదం నింపే ఆధారం వుంటుంది. "ఒకప్పుడు వారపత్రికలో అధిక శాతం పాఠకులు వారంవారం చదివేది దీర్ఘమైతే స్త్రీయే" అంటూ దానికి ఆధారం నిలువులో ఇచ్చారనుకోండి 'నవలా' అని పూరించాలన్నమాట. నవలా అని దీర్ఘంతో ముగిసే పదానికి స్త్రీ అని అర్థం మరి. అలాగే నారదుడు అనే పదం రాయడానికి కలహభోజనుడు అని ఆధారం ఇవ్వవచ్చు లేదా తమాషాగా 'అటుగా దురదూరినడు' అనీ అనవచ్చు. మల్టిపుల్ చాయిస్ సమాధానాలు వచ్చేలా ఆధారాలు గడులు నింపడానికి ఇస్తూ, అందులో తమ కీ సొల్యూషన్‌కు సరిగ్గా సరిపోయేలా సమాధానం వుంటేనే కరెక్టు అనే వైఖరి ఎక్కువైతే, ఆఖరికి అది లాటరీ వ్యవహారం అనిపించవచ్చు. ఏమైనా గళ్లనుడికట్టులు ఆలోచనకు పదునుపెడుతూ, భాషా సౌందర్యం గ్రహించడానికీ, పదాలను పట్టుకుని భాషపైపట్టు పెంచుకోవడానికీ ఎంతగానో సహకరిస్తాయనేది నిర్వివాదాంశం. భాష ఉనికికి, మనికికి, నిరంతరం పాఠకుల సాధనకు వీలు కల్పిస్తూ భాషలోని సొగసులు పరిరక్షిస్తున్న పదప్రహేళికలు సమాదరణీయాలే!

# పదమొక్కటే.. అర్థాలెన్నో

**ఇం**గ్లీషులో 'పన్' అంటాం. ఒకే పదానికి అనేకఅర్థాలు స్ఫురించేటట్లు చేసే చమత్కార పదప్రయోగం అది. దానినే మనం తెలుగులో శ్లేష అంటాం. శ్లేషను ప్రయోగించుతూ మాట్లాడే శబ్దక్రీడ కూడా భాషలోని ఓ సొగసుతనమే. శ్లేషను ఉపయోగిస్తూ ప్రాచీనకాలంలో తెలుగులో ద్వ్యర్థికావ్యాలు, త్ర్యర్థికావ్యాలు రాసిన మహాకవులున్నారు. భారతార్థం వచ్చేలా, రామాయణార్థం వచ్చేలా రెండు రకాలుగా ద్యోతకమవుతూ పద్యరచనతో కావ్యాలల్లినవారున్నారు.

పింగళి సూరన రాసిన రాఘవపాండవీయం అటువంటి రెండర్థాల ద్వ్యర్థికావ్యమే. గొప్ప శ్లేష వైభవం కలది. ఒక భాషలోని మాటల్ని ఆ భాషలోనే రెండు రకాలుగా విడగొట్టి రెండర్థాలను సాధించటం సభంగశ్లేష అంటారు. ఉచిత శబ్దశ్లేష అని కూడా దానికి పేరు. నానార్థాలు వచ్చేలా పదాలు ప్రయోగించటం అర్థశ్లేష. ఒక పదానికి గల ప్రసిద్ధమైన అర్థంతోపాటు మరొక అర్థాన్ని సాధించే చమత్కృతిని ముఖ్య గౌణవృత్తి శ్లేష అనీ, పదం యొక్క అర్థాన్ని వేర్వేరుగా అన్వయించటాన్ని అర్థాన్వయ శ్లేష అనీ, అలాగే పదాలను వేర్వేరుగా అన్వయించటం శబ్దాన్వయశ్లేష అనీ ఇలా శ్లేష కూడా అనేక రకాలుగా పేర్కొనబడింది. ఏమయినా పదము, పదము యొక్క అర్థం ఒకేలా కాకుండా, పలురకాలుగా ధ్వనించే అందమే శ్లేష అనేది. ఆధునిక కాలంలో ఇంగ్లీషు, తెలుగు భాషల రెంటి పదాల సంకలనంతోనూ ఇలాంటి శ్లేష ఉత్పత్తి చేసే చమత్కారం పెరిగింది. 'పూర్వీకులు' అంటే పూర్‌గానూ వీక్‌గానూ వుండేవారనీ, పండితుడు అంటే పన్ అనగా శ్లేషతో మాట్లాడే వాడనీ–శ్లేష అనేదానికి ఇవాళ సరికొత్తదనాలు కూడా తోడవుతున్నాయి. సినిమాల్లో ద్వంద్వార్థాలు పాటల్లోనూ, సంభాషణల్లోనూ ఎక్కువైపోయాయి. కవిగారు ఓ పదం ప్రయోగించినా చిత్రీకరణలో దానికి వేరే అర్థంవచ్చేలా చూపడమూ జరుగుతుంది. 'ఆకుచాటు పిందె తడిసె' అని పాటలో కవి ఓ అర్థంలో ప్రకృతిపరంగా రాస్తే, కెమెరా చిత్రీకరణలో తడిసిన హీరోయిన్ పైటచాటు అందాలు చూపడమూ దృశ్యశ్లేష అనాలా మరి! 'సినిమాల్లో ద్వంద్వార్థాలు ఎక్కడండీ బాబూ! ఒకటే అర్థం. అది బూతే!" అని ఆర్తి చెందుతున్న వారూ వున్నారు.

నిజానికి శ్లేషలో మంచి చమత్కారం వుంది. సరదా వుంది. గుంభనమైన అర్థం వుంది. ఆరచాటు అందమూ వుంది. కానీ శ్లేషను బూతుస్థాయికి దిగజార్చి శ్లేష అంటేనే భయపడేలా చేస్తూ వచ్చింది ప్రధానంగా సినీపరిశ్రమే అంటే కోపం తెచ్చుకోకూడదు. పఠాభి అనే కవి 'పఠాభి పన్‌చాంగం' పేర ఇలాంటి శ్లేష వాక్యాల సముదాయంతో ఎంతో సరదాలు పంచాడు. ఇటీవలి కాలంలో శంకరనారాయణ వంటి వారు శ్లేషభాషణంతో సభల్లో ప్రేక్షకులను అలరిస్తున్నారు. సినిమాల హాస్యనటుల సంభాషణల్లో ఒకప్పుడు అధికంగా వుండే ఈ శ్లేష భాషణాలు నేడు హీరోల పలుకుల్లోకీ వ్యాప్తి చెందాయి. అతివేల శృంగారఅర్థాలు స్ఫురించే శ్లేషలు జుగుప్సస్థాయికి దిగజారిన సందర్భాలూ వున్నాయి. నిజానికి శ్లేషపదప్రయోగం గొప్ప ప్రజ్ఞ.

రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుందద్గతి కావ్యమెల్లనగునే నోహూయనం జేయదే
పాండిత్యంబున నందునుం తెనుగు కబ్బందద్భుతం బంద్రుద
క్షుండెవ్వాడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్.

అని పింగళి సూరన రామ భారత కథలను శ్లేషవైభవంతో రాఘవ పాండవీయంగా రచించి మెప్పు పొందాడు. ఉదాహరణకు సూరన ఒక పద్యంలో 'ఏనుంగని కరమరయక' అంటాడు. రామాయణార్థంలో ఏనుంగు + అని కరము + అరయక అని గ్రహించినప్పుడు ఏనుగనుకొని దశరథుడు మునిబాలకుని సంహరించాడు అనే అర్థంవస్తుంది. అదే భారతార్థంలో ఏనున్ + కనికరము + అరయక అంటూ నేను దయలేకుండా మునిపై బాణం వేశానని పాండురాజు దిగులు చెందడంగా రెండో అర్థంగా వస్తుంది. ఇలా సూరన తన శబ్దశక్తిని ప్రయోగించి మొత్తం కావ్యాన్ని భారత, రామాయణార్థాలు రెండూ తెలిసేలా రాసాడు.

శ్లేషతో మాట్లాడటం కొందరికి సంభాషణా చాతుర్యంలో సహజవైఖరే. ఒకామె మిత్రునికి ఇల్లు చూపిస్తానని తీసుకువెడుతోంది. "నాతి దూరమె యిల్లు పదములాఉె" అన్నాడట అతను ఆమెతో. ఆమె కూడా 'నాతి దూరమె యిల్లు పదము లాఉె' అని బదులిచ్చింది. ఇక్కడ అతడు అడగడంలో నాతీ! ఓ స్త్రీ–దూరమే యిల్లు అనగా ఇల్లు దూరమా? పదము లాఉె అనగా కాళ్లు నొచ్చుతున్నాయి అంటే ఆమె సమాధానం న – అతి దూరమె యిల్లు అనగా ఇల్లు అతిదూరమేమీ కాదు పదములాఉె అంటే ఆరడుగులే ఇంక అని అర్థం వెల్లడవుతుంది. ఇది శ్లేష వైభవమే మరి!

పఠాభి 'పన్'చాంగంలోని ఈ చమత్కారాలు గ్రహించండి.

"నారికి వారనారికి నడుమ వారగలదు"

"పనిపాటలన్న నా కయిష్టము పాటలు రాయడం నా పని"

"దండం పట్టుట కన్నా పెట్టుట మంచిది"

"పువ్వు పుట్టగా పరీమళించదు. పువ్వుగానే పరీమళిస్తుంది"

"కల వరమాయే మదిలో"

ఇలాంటి శ్లేష చమత్కారాలు ఎన్నో. ఒక సెలూన్‌షాపు క్రిందనుండి మేడ మీదకు మార్చారు. యజమాని అక్కడ బోర్డు ఇలాపెట్టాడు "క్రింది వెంట్రుకలు నరుకు షాపు మెడపైకి మార్చబడినది" అని. మేడ బదులు మెడ అని రాయడంతో ఇంకా నవ్వురాదా మరి! శ్లేష అనగానే అందులో అశ్లీలత చూడడం, చూపడం ఎక్కువైపోవడంవల్ల ద్వంద్వార్థాల శ్లేషకు గౌరవం పోగొట్టుకుంటున్నది మనమే. కానీ, భాషలోని ఆ సొగసును అందంగా అందిపుచ్చుకుని– 'మా రేడు నీవని మారేడు తేనా నీ పూజకు' అని భక్తిగా శ్లేషించిన వేటూరి వంటి కవులూ వున్నారు. ఆ శ్లేష మనం అందుకోవడంలో వుంది. ఔను కదా!

# మాండలికం.. మహోన్నతం

ఒక భాష వ్యవహరింపబడు ఆయా ప్రాంతములలోని విలక్షణమైన భాషా వ్యవహారాన్ని మాండలికము అంటాం. భాష నిరంతరం ప్రవాహశీలం. అందులో కాలమాన పరిస్థితులకనుగుణంగా కొత్తపదాలు వచ్చి చేరుతుంటాయి. ఇంతకీ భాష ప్రధానంగా భావవినిమయ సాధనమేకదూ! అంటే కమ్యూనికేషన్ అని దేన్నంటున్నామో అదే భాషకు ప్రధానం. అయితే భాషకు ప్రామాణికత అనే మాట ఒకటి వినబడుతూంటుంది. జనం మాట్లాడుకునే భాష వ్యవహార భాష. అయితే భాషలో సహజంగా లేని లక్షణాలను కవులు, రచయితలు, లాక్షణికులు కల్పించినంత మాత్రాన వాటికిప్రామాణ్యం రాదు. రైల్వేసిగ్నల్. అంటే అర్థమైనట్లుగా 'ధూమశకట ఆగమన నిర్గమన సూచిక' అంటే అర్థం కాదు–అది దానికి సరియైన పదమే అయినా. అంచేత ఎక్కువమందికి అర్థం కావాలనే ఉద్దేశ్యంతో భాష పెరగాలి, పెంచుకోవాలి. ఇవాళ గ్లాసు, రోడ్డు, రైలు వంటి పదాలన్నీ జనసామాన్యానికందరికీ అర్థమయ్యేవే. కవులు గుర్తింపబడని శాసనకర్తలు అనిశాసన కర్తృత్వాన్ని కవికి మనం కట్టబెట్టినా లోకం ఒప్పదు. అంచేత కావ్యప్రయోగాలన్నీ ప్రమాణం కాదు.

పామరులకన్నా పండితులు పట్టుబట్టే విషయం భాషాపరిశుద్ధత అనేది. ఆదాన ప్రదానాలు లేకుండా ఏ భాషా మడిగట్టుకు కూర్చోలేదు. తెలుగు అని మనం ఇవాళ అంటున్నదానిలో సంస్కృతం నుంచి తెచ్చుకున్న పదాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. 'తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది' అని తిరుపతి వేంకట కవులు ఊరకే అనలేదు. మన లాక్షణికులు సంస్కృత శబ్దాలు తెలుగులో ప్రవేశించడాన్ని చర్చించినంత విపులంగా అన్యదేశ్యాలు– హిందీ, పర్షియన్, అరబిక్, ఇంగ్లీష్ వంటి వాటి నుంచి వచ్చి చేరిన అనేకానేక పదాల విషయంలో మౌనం వహించారు. మాండలికాల విషయమూ అంతే! నిజానికి జనజీవనంలో వాడుకలో వున్న అనేక పదాలకు కావ్య గౌరవం దక్కలేదు. ప్రాచీన నాటకాలు సంస్కృతాన్ని ప్రధాన పాత్రలకు పెట్టి, స్త్రీ పాత్రలకు ప్రాకృతం పెట్టడమూ కనిపిస్తుంది. సినిమాలలో కూడా కొన్ని ప్రాంతాల భాషను అయితే ప్రతి నాయకులకూ, లేకపోతే హాస్యపాత్రలకు నిర్ధారించేసి వాడటంవల్లనే ఒక భాషలోనే ఎక్కువతక్కువలు గౌరవన్యూనతలు చోటుచేసుకున్న ట్లయింది. ఈ పరిస్థితి అన్ని భాషల విషయంలోనూ తరతమ భేదంతో వుండనే వుంది. అన్యదేశ్య నిషేధంవల్ల భాషకు పరిశుద్ధత, పవిత్రత లభిస్తాయనుకోవడం అశాస్త్రీయం అనాలి.

భాషను శాసించాలన్న సంకల్పంగానీ, భాషలోని తప్పొప్పులను సామాజికేతర కారణాలద్వారా ముఖ్యంగా అభిరుచిప్రధాన బుద్ధితోనో, తార్కికదృష్టితోనో నిరూపించాలనే ప్రయత్నం ప్రామాణికతా నిరూపకుల లక్షణం అనేవారు బూదరాజు రాధాకృష్ణగారు. భాషలోని పరిణామాలకూ, భేదాలకూ ముఖ్య హేతువులు సామాజిక స్థితిగతులే. ఆర్థిక రాజకీయ భౌగోళిక సాంస్కృతిక కారణాలవల్ల దేశకాలపాత్రల స్వభావ పరిణామంవల్ల భాషలో వచ్చే రూపభేదాలకూ, ఆయా కాలాల్లో ఆయా సమాజాల్లో ఉండే గౌరవాగౌరవాలకూ పరస్పర సంబంధం వుంటుందనేది విస్మరించలేని విషయమే.

భాషలో ఈ పదాలే ఒప్పు, ఈ పదాలే తప్పు అని ముఖ్యంగా వినిమయ భాషలో అస్సలు నిర్దేశించడం, శాసించడం సాధ్యంకాదు. అలా అన్నా వ్యవహారం తదనుగుణంగా వుండదు. జనం తమ మాండలికంలోనే తమ కనుకూల వినిమయ వైఖరిలోనే అభివ్యక్తికావించుకుంటారు. నేడు మాండలిక రచనలు విరివిగా రావడానికి కారణం సజీవమైన భాష అంతరించిపోకూడదనే. పాత్రోచిత సంభాషణలు మాండలికంలో వుండడం అనివార్యమైన సంగతే. అలా లేకపోతే రచన జీవద్భాషలో వున్నట్లే తోచదు. అయితే రచయిత మొత్తం మాండలికంలోనే ఒక నవలనో, కథనో రాయడంవల్ల ఆ మాండలికభాష తెలిసిన ప్రాంతానికే అది పరిసీమితమైపోతుందని వ్యాఖ్యానించేవారున్నారు. కానీ జీవద్భాషలో వివిధ మాండలికాల్లో వస్తున్న రచనలు గ్రంథస్థం కావడంవల్ల, మిగతా ప్రాంతాలవారికి కూడా ఇతరప్రాంతాల భాషా వ్యవహారంతో పరిచయం, అవగాహన ఏర్పడతాయి. సన్నిహిత సాంఘికాది సంబంధాలవల్ల, భాషలో వచ్చే ఏకరూపత ఒకటి ఎలాగూ వుంటుంది. ఆ సామ్యాన్నే ప్రామాణికం అనుకోవచ్చు. అయితే ఇలా ప్రామాణీకరించడానికి అన్ని ప్రాంతాల భాషారూపాలు, సౌందర్యం, భావవినిమయంలో ఆయా మాండలిక ప్రభావం దోహదమవుతాయి. కావాలి కూడాను. పండితులను పామరులనుకరించటం జరుగుతూనే వుంటుంది. అలాగే జనమమేకమయ్యే పండితుడు ఆ పామరభాషనూ ఔచితీమంతంగా, భావవినిమయానుకూలంగా అభివ్యక్తీకరించడమూ జరుగుతుంది. జనసముదాయం యొక్క సామూహిక జీవనానికి ఉపకరించగలిగేది భాషయే. మానవ హృదయాలను ఏకీకరించటానికీ, విభేదాలు రేకెత్తించడానికీ రెండువైపులా పదునుగల కత్తిలాంటిదే భాష, కరవాలచాలనం తెలిస్తే కరచాలనం సులువవుతుంది. జన్మజాతమైన భాషలో అధ్యయనం జరగడం ప్రధానం. తెలుగు మాధ్యమానికి దూరమయ్యే విద్యార్థి భాషాప్రేమికుడు, భాషా సంపన్నుడు ఎలా కాగలుగుతాడు. అందువల్ల తెలుగును పరిరక్షించుకోవడం అంటే మాండలికాలతో సహా, నేల నాలుగు చెరగులా వున్న మన మాతృభాషను గౌరవించి సమాదరించి మాటలో, లిపిలో మదిలో సుస్థిరపరచి భావవినిమయం కావించాలి. తెలుగు వెలుగు జిలుగులకు మాండలికాలు మట్టిదీపాలే కాదు, మణిదీపాలు కూడాను.

# ఊతాన్నిచ్చేవే ఊతపదాలు

'**సొ**గసు చూడతరమా' అని కవిగారు ఊరకే అనలేదు. సొగసు పాదాల్లో వుంటుందని చైనా వారు ఎక్కువగా భావిస్తారట. మనమూ పాదాల్లో సొగసులు చూస్తాం అయితే అది పద్యపాదాల్లో. వాక్య సముదాయంలోని వాక్యపాదాల్లో. పాదాల్లో ప్రయోగించే పదాలే భాషలో సొగసు మరి! ఒకరు మాట్లాడుతూంటే వినవేడుక కలుగుతోంది అంటే అది వారు భాషను ప్రయుక్తం చేసే తీరును బట్టే. భావాభివ్యక్తికి భాషను సొగసుగా వినిమయం చేయడంలోనే వక్త నేర్పు వుంటుంది. కొందరు తమ మాటల్లో సామెతలను, జాతీయాలను ప్రయుక్తం చేస్తూంటారు. ఆ సందర్భానికి ఆ సామెత అతికితే సరే కానీ, లేకపోయినా కొందరికి అదో అలవాటు. 'ఏదోసామెత చెప్పినట్లు' అంటారు. సామెత చెప్పకుండా ఆ మాట ప్రయోగించడం ఒక వైఖరి. ఇలాంటి వైఖరినే ఊతపదాలుగా భాషలో గుర్తించారు. ఊతపదాలు కూడా ఒక సొగసే! అంతేకాదు, ఆ ప్రయోగించే ఊతపదాన్నిబట్టి ఆ వ్యక్తిని గుర్తించే తీరూ వుంటూంటుంది. అంటే తమ సంభాషణకు, ఆ సంభాషణ తొట్రుపడకుండా సాగడానికీ ఓ ఊతపదం వారికి ఉండాలి. ''ఇది నాకు ఇది చెప్పినప్పట్నుంచీ ఏదో ఇదిగా అనిపించింది. ఇది వద్దనుకున్నా అంత ఇది ఏమీకాదుగానీ'' అంటూ ఆ ఇది ఏమిటో తెలియకుండా ఒకటే ఇదిగా మాట్లాడే వారుంటూంటారు. ఇది, అది, మరి లాంటి పదాలు ప్రసంగకర్తలు పదే పదే కొందరు ప్రయుక్తం చేసిగానీ, ముందుకు వెళ్ళలేరు. ఒకాయన అభివృద్ధి సూచకంగానే కాదు, పలు రకాలుగానూ 'ఆ విధంగా ముందుకు పోతున్నాం' అంటారు. ఆ ఊతపదం ఏమిటో తెలియగానే ఆ వ్యక్తి ఎవరో కనులముందు ఊహించుకోగలుగుతున్నామంటే అది ఊతపదంలోని సొగసే మరి!

ఒక ప్రాంతంలో విరివిగా వ్యవహృతమౌతూండే పదాలూ ఊతపదాలుగా భాసిస్తూంటాయ్–'ఆయ్!', 'మరేనండి', 'కాదుమరీ' వంటివి అలాంటి పదాలు. 'వెధవ' వంటి పదాలు మాత్రమే కాకుండా, కొంత అశ్లీలార్థకంగా కనిపించే పదాలనూ తమ మాటల్లో నిజానికి మనసులో అలాంటిభావం ఏమీలేకపోయినా అలవోకగా వాడేస్తుంటారు కొందరు. ఒకాయన ప్రతిదానికీ 'నా తలకాయ' అంటూంటాడు. 'సిగదరగ' అని వాడుతూంటారు ఇంకొకరు.

ఊతపదం అనడంలోనే అర్థం తెలుస్తోంది కదా! ఆ పదం వాళ్లకు 'ఊత' అని. సంభాషణ సాగడానికి ఆ పదం వారికి వుండితీరాలి. అలా అనకుండా మాట్లాడమని మీరు శాసిస్తే వారు మూగవోతారు. ప్రయత్నించినా మాట్లాడలేకపోవచ్చు. సామెతలను సంభాషణల్లో ఊతగా తీసుకునే వైఖరి అలాంటిదే. ఓ రాజుగారి ఆస్థానంలోని ఒక ఉ ద్యోగి మాట మాటాడితే సామెత చెబుతూండేవాడట. ఆ సామెతలు వినీవినీ రాజుగారికి

విసుగొచ్చేసిందట. సామెత ప్రయోగించకుండా మాట్లాడమని హుకుం జారీచేశాడట. ఆ ఉద్యోగి వినిపించుకోకపోయేసరికి అతనికి ఉరిశిక్ష వేసాడట. తీరా ఉరితీసే సమయంలో జాలి కలిగి "ఇకనైనా సామెతలు చెప్పనని మాట ఇయ్యి. ఉరిశిక్ష రద్దుచేస్తాను" అన్నాడట. దానికా ఉద్యోగి "అలాగే మహారాజా! సామెతలు ప్రయోగించను. అసలు మాట్లాడటం కూడా తగ్గించేస్తాను. ఊరుకున్నంత ఉత్తమం బోడిగుండంత సుఖం లేదన్నారు" అన్నాడట. ఆ తర్వాత రాజుగారు ఏం చేసారో మరి!

కొందరికి పొడుపుకథలువేస్తూ మాట్లాడటం అలవాటు. పొడుపు కథలది చాలా ప్రాచీనమైన చరిత్ర. అనేక దేశ, విదేశీ భాషల్లో కూడా అవి వున్నాయి. పొడుపు వున్నప్పుడు విడుపు కూడా వుంటుంది. 'గోడమీద బొమ్మ గొలుసుల బొమ్మ వచ్చిపోయేవారికి వడ్డించు బొమ్మ' అంటూ మునుపు చిన్నతరగతి తెలుగు వాచకాల్లో పొడుపు కథలు వేసి, తేలు బొమ్మను అందుకు సమాధానంగా ముద్రించి, పిల్లలను అలరించడం వుండేది. ప్రయోగించే పదాలు, వాక్య నిర్మాణ చతురత, ఆకట్టుకునే తీరు వీటివల్లే భాషలో సంభాషణలు పరస్పర భావ వినిమయానికి సొగసుగా రాణిస్తూవున్నాయి. సినిమాలలో కొన్ని పాత్రలకు రచయితలు సంభాషణల్లో చొనిపే ఊతపదాలు ఆ పాత్ర ప్రసిద్ధికి హేతుమవుతూంటాయి. 'ఆమ్యామ్యా', 'తుత్తి, తీతా' వంటి పదాలు అలాంటివే! 'సరే అలానే కానీయ్', 'అయితే ఓకే', 'అంత సీన్ లేదు', 'లైట్ తీస్కో' అంటున్నారు నేటితరం. భాష భావ వినిమయ సాధనం అని ముందే చెప్పుకున్నాం కదా! లోకంలో సగం అనర్థాలకు అసలు కారణం అపార్థాలు. ఆ అపార్థాలకు హేతువు-అనుకున్నది అనుకున్నట్లుగా అవతలివారు అర్థంచేసుకునేట్లుగా మాట్లాడలేకపోవడమే. కాలుజారితే తీసుకోగలం కానీ మాటజారితే తీసుకోలేం అనేమాట అందుకే వచ్చింది. మాటలను ప్రయుక్తం చేయడం భావాభివ్యక్తికే అయినా, ఆ అభివ్యక్తిలో తనదైన సొగసును చూసి మాట్లాడగలవారే రాణిస్తూంటారు.

అందుకే సంభాషణాచాతురి, ప్రసంగకళ వంటి మాటలు వచ్చాయి. మాటలతో మోసాలు చేసేవారున్నారు. మాటలతో మానవ సంబంధాలను మెరుగుపరచగలవారూ వున్నారు. మాటతీరుకు భాషలోని సొగసును అందిపుచ్చుకుని సమర్థవంతంగా, సహేతుకంగా సకాలంలో సద్వినియోగపరచుకోవడం అవసరం. ఏమైనా మన తెలుగు భాషలో సొగసులు గ్రహించి తెలుగులోనే మాట్లాడుకుందాం. బంధుమిత్రులతో, కుటుంబసభ్యులతో తెలుగు మాట్లాడుకోవడమే కాదు చదవనూ, రాయనూ వచ్చినవారితో తెలుగులోనే రాతకోతలు సాగిద్దాం. భాషలోని సొగసులతో తెలుగును మాటలో, రాతలో తేజరిల్లచేసుకుందాం.

*తెలుగులో మాట్లాడడం మాత్రమే కాక, చదవడం, రాయడం, ఆలోచించడం అనే అన్ని పార్శ్వాలనూ పటిష్ఠపరుచుకుంటూ మన భావితరం తెలుగువెలుగు దీధితులను విశ్వవ్యాప్తం చేయగలదని ఆకాంక్షిద్దాం.*

# బ్లాగు(లో)భాషణం

**వారంవారం ఈ వ్యాసాలు ఆంధ్రభూమి దినపత్రిక 'నుడి'లో ధారావాహికంగా ప్రచురింపబడినప్పుడు 'సుధామధురం బ్లాగ్'లో అంతర్జాల వీక్షక పాఠకులతో పంచుకున్నప్పుడు వ్యక్తమయిన భావాలు, సాగిన సంభాషణలు ఇవి:**

**"మృతం కాదు అమృతం"**

Congrats for starting yet another column, that too on our beloved mother tongue Telugu. I am sure that this column will ignite renewed interest in propagating our language.

***-Amballa Janardhan-Mumbai***

*February 25, 2012*

మీరు రాస్తున్నారుగా సుధా మధురంగా... బావుంటుంది రసభరితంగా!
మనం ఏ భాషకూ వ్యతిరేకం కాదు. ఎవరి యాసకూ అంతకన్నా వ్యతిరేకం కాదు. మనం కోరేదొకటే... మనవైన పదాలున్నచోట పరాయివాటికోసం వెంపర్లాడటం దేనికనే! మన భాషని మరింత వాడకంలోకి తేవటానికేగా మన తపనంతా!
మీ కొత్త శీర్షికకు స్వాగతం

***డా॥ జి.వి.పూర్ణచందు***

*ఫిబ్రవరి 25, 2012*

**సుధామ :**

మీ స్వాగతాదరాలకు ధన్యవాదాలు పూర్ణచంద్ గారూ!

Thanks a lot Amballa Janardhan garu for your good wishes.

*ఫిబ్రవరి 26, 2012*

**"జంటపదాలు.. భాషకు సిరిసంపదలు"**

**శ్రీ పంతుల గోపాలకృష్ణ** www.apuroopam.blogspot.com

మంచి విషయమే చెప్పారు బాగుంది. ఇంకా చాలా జంటపదాల్ని పరిచయం చేయాలి. అందంచందంలో చందానికి విధము అంటే ప్రవర్తించే తీరు అని అర్థం తీసుకోవాలి. కేవలం అందంగా ఉంటే చాలదు, ప్రవర్తించే తీరు కూడా బాగుంటేనే

శోభిస్తుందని అందం చందం అంటారు. అలాగే చేదోడువాదోడు అన్నప్పుడు వాదోడు అంటే వాక్కుతోడు--మాట సాయం అన్నమాట. చేతిసాయం, మాటసాయం కలిపి చేదోడు వాదోడు అయ్యాయి. భాషలోని నిసర్గ సౌందర్యాన్ని ఇటువంటి పదాలు, సామెతల ద్వారా యువతరానికి పరిచయం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*March 3, 2012*

**సుధామ:**

ధన్యవాదాలు గోపాలకృష్ణగారూ! మీరన్నట్లు నేటి యువతకు వాచవిగా పరిచయంచేయడంకోసమే ఇది. మీ వంటి పెద్దల చేదోడువాదోడు లభించినప్పుడే నిజంగా మరి అందంచందం.

*March 3, 2012*

**సోమార్క :**

సుధామ గారూ! చక్కని జంటపదాలను పరిచయం చేశారు. నేటి యువతకే కాదు, విద్యార్థులకు బాగా తెలియాలి. మంచి ప్రయత్నం!

*March 3, 2012*

**సుధామ:**

ధన్యవాదాలు సోమార్క గారూ! *March 3, 2012*

**ఏల్చూరి మురళీధరరావు:**

**సుధామగారూ!**

మీ బ్లాగును ఈరోజే చూశాను. చాలా బాగుంది.

భిన్న మూలాలై ఏకార్థీకృతాలైన జంటపదాలను, తదన్యంగా ఇతరేతరయోగం ఉన్న ద్వంద్వపదాలను ఆకృతిగణంగా పరిగణించారు కాని, చక్కని జంటలను పరిచయం చేశారు. మీ వ్యాసం చదువుతున్నప్పుడు-సంప్రదాయవాదులు నాస్తికతను విమర్శించటం కోసం అవాక్కులు చార్వాకులు అన్నదే అవాకులు చెవాకులు అయిందేమో అనిపించింది.

సుధా-ధామ జంటపదాలు ఏకపదమైతే సుధామ అనవచ్చునా!

*March 7, 2012*

**సుధామ:**

మురళిగారూ! నమస్కారం. మీ పాండితీగరిమ ముందు నేను వినమ్రుడిని. యువతకు తెలుగుభాషపట్ల అభిరుచి పెంచడానికి వాచవిగా మాత్రమే పునశ్చరణ చేస్తున్న చిరుప్రయత్నం ఇది. *March 7, 2012*

**మరువం ఉష :**

సుధామగారు చెప్పిన మంచివిషయాలకి కృతజ్ఞతలు. ఒక్క సందేహం తీర్చగలరని ఇక్కడ పెడుతున్నాను. నేను రాసుకున్న జంటపదాల్లో ఎడాపెడా/ఎడపెడ, చెడమడ ఉన్నాయి. చెడామడా జంటపదమా కాదా అన్నది తెలీట్లేదు. అలాగే శ్రీ మురళీధరరావు ఏల్చూరి గారు తన అభిప్రాయంలో "భిన్న మూలాలై ఏకార్థీకృతాలైన జంటపదాలను, తదన్యంగా ఇతరేతరయోగం ఉన్న ద్వంద్వపదాలను ఆకృతిగణంగా పరిగణించారు" అన్నదానిపై ఇంకాస్త అధ్యయనం చేయాలని నాకు ఆసక్తి కలిగింది. మీకు తెలిసిన సమాచారం / పుస్తకాలు తెలుపగలరా?

ఈ వివరాలు కాస్త సమాచారానికే. వృత్తిరీత్యా ఐటీ రంగంలో ఉన్న నాకు తెలుగుభాష మీద ఎక్కువ పట్టులేదు. 'మరువం' బ్లాగులో మునుపు భావ / అనుభూతి కవిత్వం రాసుకునేదాన్ని. నేను చికాగో ప్రాంతాల్లోని 5-15 ప్రాయపు పిల్లలకి తెలుగు నేర్పుతున్నాను. ప్రస్తుతం "గలాగలా, భగభగ' వంటి పదాలు విశేషణాలుగా ఎలా వాడొచ్చో చెప్తున్నాను. తర్వాతి పాఠం జంటపదాల మీద రాస్తూ, అలా సమాచారం వెదుకుతూ ఇటుగా వచ్చాను.

*March 17, 2012*

**ఏల్చూరి మురళీధరరావు:**

అమ్మా, నా వాక్యానికి స్పందనగా మీరడిగిన ప్రశ్నకు ఆరేడు దళాలలో సమాధానం వ్రాసే ప్రయత్నం చేస్తాను.

1. సాధారణంగా జంటపదాలలో అనుప్రాసయుక్తములైన రెండు పదాలుంటాయి. కొంపా గోడూ; అభమూ శుభమూ; అన్నెం పున్నెం మొ॥
2. అర్థం చెప్పవలసి వస్తే మొదటిపదం అర్థమే రెండవపదానికీ వర్తిస్తుంది. "పిల్ల మేకా"లో రెండవ పదానికి ఉన్న విశిష్టార్థం మొదటిదానితో కలిసిపోతుంది.
3. ద్వంద్వసమాసాలన్నీ జంటపదాలు కావు. రెండు పదాలకూ వేర్వేఱు అర్థాలుండి, రెండిటికీ వేర్వేఱు అన్వయమూ ఉంటే అవి జంటపదాల పరిధిలోకి రావు. "పిల్లలు తల్లిదండ్రులు చెప్పినమాట వినాలి" అంటే-తల్లిదండ్రులు జంటపదం కాదు. జంటలున్నంత మాత్రాన జంటపదాలు కావు. "సిరిసంపదలు" అన్నప్పుడు సిరులు-సంపదలు అర్థాలు ఒకటైపోతాయి. వేఱు అర్థాలలో ప్రయోగిస్తే అది ద్వంద్వసమాసం మాత్రమే.
4. మీరడిగిన "ఎడా పెడా" అన్నది "పదే పదే", అనేకపర్యాయాలు అన్న అర్థంలో జంటపదాలే. "ఎడమవైపు, కుడివైపు చూసుకొంటూ నడిచాను" అన్న అర్థంలో వ్యస్తంగా వాడితే అవి జంటపదాలు కావు.

5. మీరన్న "చెడామడా" వంటివి అన్యదేశ్యాలైన వాడుకలు. అవీ జంటపదాలే.
6. "అవాకులు చెవాకులు", "గాసట బీసట" వంటి జంటపదాలలో రెండు అర్థాలూ ముఖ్యమైనవే అయినా–ఆ రెండింటికి తాత్పర్యంగా వేరొక వ్యంగ్యార్థాన్ని గ్రహించటం పరిపాటి. వాటి అర్థాలను మీరు గుర్తించి విద్యార్థులకు నేర్పితే పాఠం ఆసక్తిదాయకం అవుతుంది.
7. ధ్వన్యాద్యనుకరణ శబ్దాలన్నీ జంటపదాలే. "గణగణ", "గుసగుస" మొదలైనవి. వీటి అర్థాలు అనేకవిధాలుగా ఏర్పడి ఉండవచ్చును. వ్యుత్పత్తి తెలిసిన కొద్దీ మీకు ఆ జంటపదాల అవసరం, "అందచందాలు" అనుభవంలోకి వస్తాయి.

శ్రీ సుధామ గారి చక్కటి ఈ వ్యాసం మీ వంటి విద్యాబోధకులలో ఆసక్తిని కలిగించినదంటే–వ్యాసరచనోద్దేశం సాఫల్యాన్ని సంతరించికొన్నట్లే. మీ విద్యార్థిత్వానికి, మీలోని విద్యార్థిత్వాన్ని మేలుకొలిపిన విద్వత్తల్లజునికీ నా అభినందనలు.

**–ఏల్చూరి మురళీధరరావు**

*March 17, 2012*

**మరువం ఉష :**

సుధామగారూ, ముందుగా నా సందేహం తీరటానికి ఇలా శ్రద్ధగా మురళి గారిని సంప్రదించినందుకు కృతజ్ఞతలు.

ధన్యవాదాలు మురళీధరరావు గారూ! ఇక్కడ పుట్టి పెరుగుతున్న పిల్లలకి తెలుగు భాషపట్ల అభిరుచి, ఆసక్తి పెంచడానికి, పంతుల గోపాలకృష్ణ గారు వ్యక్తపరిచినట్లుగా భాషలోని సౌందర్యాన్ని సరళమైన పద్ధతుల్లో (కథలు, నాటికలు) పరిచయం చేస్తూనే, నా అవగాహన, పరిజ్ఞానం విస్తృతి పెంచుకునే ప్రయత్నాల్లో ఉన్నాను. ఈ వివరాలు చాలా ఉపయోగం నాకు.

*March 18, 2012*

**సుధామ:**

అది మురళిగారి ఔదార్యం తప్ప నా గొప్ప కాదు ఉష గారూ!

*March 121, 2012*

**హనుమాన్ బంద్రెడ్డి:**

తెలుగు భాషా పండితులకు వందనములు. జంట పదాలు గురించి వివరంగా చెప్పారు.

1. 'బాగోగులు' అనే పదంలో రెండు పదాల కలయిక ఉందా?
2. మాటల్లో వాడే 'బడీగిడీ', 'నీళ్లూగీళ్లూ' వంటివి జంట పదాలేనా? దయచేసి వివరించగలరు.

*December 13, 2012*

**"భాషకు 'సమయాల' సోకు"**

**వెంకట రాజారావు, లక్కాకుల :**

నాటి కావ్యాల రత్నాల పేటికలుగ
తీర్చి భాషామతల్లికి కూర్చిరపుడు
పద్యమే యర్థమవ్వని పాట్లు నేడు
ఏలనయ్య భాషకు 'సమయాల' సోకు?
**బ్లాగు : సుజన – సృజన**

*March 17, 2012*

**సుధామ:**

ధన్యవాదాలు రాజారావు గారూ! మీరన్నది నిజం. ఏమయినా పద్య వారసత్వాన్నీ, హృద్యమైనపద్యంలో సౌందర్యాన్నీ సంరక్షించుకుంటే భాషలోని పెన్నిధులను సంరక్షించుకున్నట్లే.

*March 17, 2012*

***"రూఢివాచకా'ల మెరుగులు"***

చాలా బాగుందండీ సుధామగారూ.

ఎప్పట్నుంచో రూఢిగా తెలిసిన పదాలే అయినా, అవన్నిటినీ విరివిగా వాడుతున్నా.. రూఢి పదాలు అనే మాటని చాలా రోజుల తరువాత గుర్తుకు తెచ్చారు.

ధన్యవాదాలు.

**–మంథా భానుమతి:**

*March 24, 2012*

**మరువం ఉష :**

ప్రభంజనం (ఒక వ్యక్తిశక్తికి ప్రతీకగా), సుడిగాల్లా చుట్టేశాడు, చిగురాకులా ఎగిరిపడ్డం – ఇవీ రూఢివాచకాల్లోకి వస్తాయా? మీ వ్యాసాలు నేర్చినవి వల్లెవేసుకోవడానికీ, రానివి బట్టీయం వేయడానికీ చాలా బాగున్నాయండి.

*March 25, 2012*

**<u>శ్రీలలిత:</u>**

మనం తరచూ వాడే పదాలని రూఢిపదాలంటారని ఇప్పుడే తెలిసింది.

మీరు చెప్పే విశ్లేషణలు కొత్తకోణంలో దర్శనమిస్తున్నాయి. వ్యాసం ఉపయోగకరంగా వుంది.

*March 26, 2012*

**"అక్షరాలు అవే... అటొక అర్థం... ఇటొక అర్థం"**

**సోమార్క :**

చాలా బాగున్నాయి మకతిక పదాలను తికమక చేసి చూపించారు వేరు వేరు అర్థాల్లో! ధన్యవాదాలు.

*April 7, 2012*

**సి. ఉమాదేవి:**

చిన్నప్పుడు తెలుగువాచకం తెరవగానే ప్రశ్నలకన్నా ముందు అర్థాలు, నానార్థాలు, వ్యుత్పత్తి అర్థాలు, వ్యతిరేక పదాలు చకచకా చదివేసేవారము. ఇప్పుడు ప్రతి శనివారం 'నుడి' ఆ స్థానాన్ని ఆక్రమిస్తోంది. పిల్లలకు కూడా చక్కగా అర్థమయే రీతిలో పదాల సొబగులను వివరిస్తున్నారు. తెలుగుభాషపై మరింత మమకారం పెంచుతున్నారు.

*April 7, 2012*

**రఘుపతిరావు గడప:**

బాగున్నాయి...

*March 7, 2018*

**"పర్యాయపదాలు : సొబగే కాదు... ఒదుగు కూడా"**

**మరువం ఉష:**

పర్యాయపద నిఘంటువుని గూర్చి తెలిపారు. థాంక్స్. 'స్త్రీ'కి ఉన్న పర్యాయపదాలు అన్నీ తీసిపెట్టుకున్నాను–మరొక మారు ధన్యవాదాలు.

*April 14, 2012*

**సుధామ:**

మీ ఆదరణకు కృతజ్ఞతలు ఉష గారూ!

*April 15, 2012*

వారం వారం చదివి మీ అభిప్రాయాలు తెలియచేస్తున్నందుకు చాలా సంతోషం.

*April 16, 2012*

**మనోహర్ బోరంచ:** ప్రధానోపాధ్యాయులు

స్త్రీకున్న పర్యాయపదాలలో నేను విననివి: కోమలి, ఏతుల, చెడె, తొయ్యలి, దుండి, యోష.

ధన్యవాదాలు.

*April 16, 2012*

**ఆదూరి హైమవతి:** బెంగళూరు, కర్ణాటక

పర్యాయపదాల నిఘంటువు గూగుల్లో లభ్యమగునా! తెలుపగలరు. అసలలాంటి నిఘంటువు ఉన్నట్లు మీవల్లే తెలిసింది సుమండీ!

*October 16, 2013*

**“ప్రాసాక్షరాలు భాషకు ఆభరణాలు”**

**కథా మంజరి :** పంతుల జోగారావు, విజయనగరం

చక్కగా చెప్పారు, మరిన్ని ఉదాహరణలు జోడిస్తే కొత్తతరానికి మరింత ఉపయుక్తంగా ఉండేది.

*April 21, 2012*

**కనకాంబరం :** నూతక్కి రాఘవేంద్రరావు

వాస్తవం. చాలా బాగుంది సార్!

*April 21, 2012*

**జ్యోతిర్మయి:**

ప్రాసాక్షరాల గురించి బాగా చెప్పారు.

*May 14, 2012*

**“మాండలికం... మహోన్నతం”**

**మాగంటి వంశీ మోహన్:**

“కరవాలచాలనం తెలిస్తే కరచాలనం సులువవుతుంది”

*May 12, 2012*

**సుధామ:**

మాగంటి వంటి వారికి నచ్చితే మాకెటువంటి సంతోషమో వేరే చెప్పాలా! కృతజ్ఞతలు.

*May 12, 2012*

**కనకాంబరం :**

ఎన్నెన్నో విషయాలు తెలిసినవి విన్నవే, ఎంతో విపులంగా తెలుసుకున్న తృప్తి. సుధామ గారు నమస్కారం. ఎలా వున్నారు? శ్రేయోభిలాషి... నూతక్కి రాఘవేంద్రరావు (కనకాంబరం)

*May 5, 2012*

anrd : అనూరాధ

భాషను గురించి చక్కటి విషయాలను తెలియచేసినందుకు కృతజ్ఞతలండి.

*May 5, 2012*

❀ ❀ ❀

# యువభారతి ప్రచురణలు

1. సరస్వతీ సాక్షాత్కారం (పద్యకావ్యం) – అనుముల కృష్ణమూర్తి (12–3–1967)
2. జీవనగీత (వచనకవితా సంకలనం) – ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్'కు తెలుగులో స్వేచ్ఛానువాదం–కాళోజి (8–1968)
3. వీచికలు (వచనకవితా సంకలనం) – ఇరివెంటి కృష్ణమూర్తి, చక్రవర్తి వేణుగోపాల్, అల్లంరాజు వెంకట్రావు (సుధామ), వంగపల్లి విశ్వనాథం (1968)
4. పంచవటి (కథా సంకలనం), లత, శీలావీర్రాజు, అవసరాల, మంజుశ్రీ, ఆనందారామం (1969)
5. రచన (గోష్ఠి: వ్యాససంకలనం) – మారుతున్న విలువలు–రచయితల బాధ్యతల పై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (26.7.1970)
6. కావ్యలహరి (ఉపన్యాస వ్యాససంపుటి) – పంచమహాకావ్యాలు (శృంగారనైషధము, మనుచరిత్రము, పారిజాతాపహరణము, వసుచరిత్రము, విజయవిలాసము)పై ఉపన్యాస వ్యాసాలు – చార్య దివాకర్ల వేంకటావధాని (12–9–1971)
7. అక్షరాలు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (24–10–1971)
8. చైతన్యలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – తిక్కన, పాల్కురికి సోమన, శ్రీకృష్ణదేవరాయలు, వేమన, గురజాడలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (6–8–1972)
9. మహతి (వ్యాససంకలనం)–స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగుతీరుతెన్నులు (1947–1972) వందమంది ప్రసిద్ధరచయితల సమీక్షావ్యాసాలు (14–8–1972)
10. Free India Forges Ahead (ఆంగ్ల వ్యాస సంకలనం) – డా॥పి.వి.రాజగోపాల్ (సం) (15–10–1972)
11. స్వరాలు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (4–4–1972)
12. ఉషస్సు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (4–4–1973)

13. మళ్ళీ వెలుగు (వచన కవితా కావ్యం) – శీలా వీర్రాజు (4–4–1973)

14. ఉదయం (కథాసంకలనం) – యువభారతీయులు (7–10–1973)

15. కథావాహిని–1 (కథాసంకలనం) – యువభారతీయులు (7–10–1973)

16. కథావాహిని–2 (కథాసంకలనం) – యువభారతీయులు (7–10–1973)

17. మందార మకరందాలు (వ్యాఖ్య) – ఎంపిక చేసిన పోతన భాగవత పద్యాలకు వ్యాఖ్య – సి.నారాయణరెడ్డి (21–10–1973)

18. వికాస లహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – నన్నయ, పోతన, సూరన, కందుకూరి, తిరుపతి వేంకట కవులపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (2–12–1973)

19. ప్రజాసూక్తం (సామెతలు) – సామెతల సంకలనం (2–12–1973)

20. వేమన్న వేదం (వ్యాఖ్య) – ఎంపికచేసిన ప్రజాకవి వేమన్న పద్యాలకు వ్యాఖ్య–ఆరుద్ర (ఉగాది 1974)

21. భోగినీలాస్యం (కవిత్వం – వ్యాఖ్య) – వానమామలై వరదాచార్యులు (24–3–1974)

22. వడగళ్ళు (వ్యాస సంకలనం) – రావూరి వేంకట సత్యనారాయణ (19–7–1974)

23. నా గొడవ (వచనకవితా సంకలనం) – కాళోజి (9–9–1974)

24. శ్రీనాథుని కవితా వైభవం (వ్యాఖ్య) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం

25. మేం (వచనకవితా సంకలనం) –సుధామ, నాగినేని భాస్కరరావు (6–10–1974)

26. విశ్వనాథ కవితావైభవం (వ్యాఖ్య) – జువ్వాడి గౌతమరావు (17–11–1974)

27. సింధూరం (వచనకవితా సంకలనం) – ప్రసిద్ధ కవులు (1–12–1974)

28. శిఖరాలు–లోయలు (వచనకవితా సంకలనం) – డా॥సి.నారాయణరెడ్డి (1–12–1974)

29. భావన (సూక్తులు) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి, డా॥నాగినేని భాస్కరరావు(సం) (1–12–1974)

30. ప్రతిభాలహరి (ఉపన్యాస వ్యాససంకలనం) – శ్రీనాథ, తెనాలి రామకృష్ణ, పానుగంటి, విశ్వనాథ, శ్రీశ్రీలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (1–12–174)

31. మెరుపులు (వచనకవితాసంపుటి) – పొట్లపల్లి రామారావు (1–12–1974)

32. తిక్కన కవితావైభవం (వ్యాఖ్య) – డా॥పాటిబండ మాధవశర్మ (1–12–1974)

33. TELUU NOVEL : VOL-1 (ఆంగ్ల వ్యాససంకలనం) – యం.శివరామకృష్ణ (సం) పదమూడు ప్రముఖ తెలుగు నవలలకు ఆంగ్లంలో వ్యాసాలు (2–2–1975)

34. మరపురాని మనీషులు (వ్యాససంపుటి) – ముప్పైనాలుగు మంది ప్రముఖులపై పరిచయ వ్యాసాలు – డా॥తిరుమల రామచంద్ర (2–2–1975)

35. చేమకూర కవితావైభవం (వ్యాఖ్య) – యమ్.కులశేఖరరావు (2–2–1975)

36. చలం ఆలోచనలు (సంపుటి) – చలం మ్యూజింగ్స్ నుంచి ఎంపిక చేసిన రచనలు (23–11–1975)

37. భారతీ వైభవం (వ్యాఖ్య) – పాతూరి సీతారామాంజనేయులు (14–12–1975)

38. భారతనారి నాడు–నేడు (వ్యాససంకలనం) – ఇల్లిందల సరస్వతీదేవి (14–12–1975)

39. తిమ్మన కవితావైభవం (వ్యాఖ్య) – డా॥బి.వి.కుటుంబరాయశర్మ (21–12–1975)

40. కవితాలహరి (ఉపన్యాస వ్యాససంకలనం) – నాచన సోమన, పిల్లలమర్రి పినవీరభద్రుడు, జాషువా, దాశరథి కవులపై ప్రముఖుల వ్యాసాలు (15–1–1976)

41. ధూర్జటి కవితావైభవం (వ్యాఖ్య) – డా॥పి.యస్.ఆర్.అప్పారావు (4–1–1976)

42. తులసీదాస్ కవితావైభవం (వ్యాఖ్య) – డా॥భీంసేన్ నిర్మల్ (4–1–1976)

43. కవితా లత (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (మహిళలు) (4–1–1976)

44. నన్నయ కవితావైభవనం (వ్యాఖ్య) – ఆచార్య దివాకర్ల వేంకటావధాని (15–1–1976)

45. ధర్మపథం ( సంస్కృత శ్లోకాలకు వ్యాఖ్య) – బులుసు వేంకటరమణయ్య (31–3–1976)

46. శతక సౌరభం (వ్యాఖ్య) – ప్రసిద్ధ శతకాల నుండి ఎంపిక చేసిన పద్యాలకు వ్యాఖ్య – డా॥కె.గోపాలకృష్ణారావు (21–11–1976)

47. నన్నెచోడుడి కవితావైభవం (వ్యాఖ్య) – డా॥నిడదవోలు వేంకటరావు (21–11–1976)

48. పగలే వెన్నెల (సినిమాపాటల సంపుటి) – డా॥సి.నారాయణరెడ్డి (21–11–1976)

49. సూరదాస్ కవితా వైభవం (వ్యాఖ్య) – డా॥ఇలపావులూరి పాండురంగారావు (19–12–1976)

50. రామాయణ సుధాలహరి (ఉపన్యాస వ్యాససంకలనం) – వివిధ భాషలలోని రామాయణాలపై ఉపన్యాస వ్యాసాలు (19–12–1976)

51. కాళిదాస కవితావైభవం(వ్యాఖ్య) – డా॥పుల్లెల శ్రీరామచంద్రుడు (19–12–1976)

52. తిరుపతి వేంకటకవుల కవితావైభవం (వ్యాఖ్య) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (2–1–1977)

53. కిరణాలు–కెరటాలు (వచనకవితా సంకలనం) డా॥తిరుమల శ్రీనివాసాచార్య (2–1–1977)

54. గోరాశాస్త్రీయం (సంపాదకీయాలు) – గోరాశాస్త్రి (2–1–1977

55. సాహిత్య అధ్యయనం (ఉపన్యాస వ్యాస సంకలనం) – నవల, దృశ్యకావ్యం, పత్రికలు, కవిత్వంపై ప్రముఖుల వ్యాసాలు (2–1–1977)

56. బాలభారతి (బాలలరచనల సంకలనం) – డా॥వెలగా వెంకటప్పయ్య (సం) (10–3–1977)

57. పాల్కురికి కవితా వైభవం (వ్యాఖ్య) – డా॥ముదిగొండ శివప్రసాద్ (6–11–1977)

58. నవోదయ లహరి (వ్యాస సంకలనం) – రాయప్రోలు, నాయని, నండూరి, ఆరుద్ర, కుందుర్తి, సి.నారాయణరెడ్డిలపై ప్రముఖుల వ్యాసాలు (4–12–1977)

59. విజ్ఞానోదయం (విజ్ఞానశాస్త్ర వ్యాస సంపుటి) – డా॥రెడ్డి రాఘవయ్య (10–6–1979)

60. గోపిచంద్ సాహిత్యం (వ్యాఖ్య) – త్రిపురనేని సుబ్బారావు (8–9–1979)

61. భారతీయ పునరుజ్జీవనం (వ్యాస సంపుటి) – డా॥డి.రామలింగం (17–3–1980)

62. రామాయణ పరమార్థం (వ్యాఖ్య) – డా॥ఇలపావులూరి పాండురంగారావు (25–3–1980)

63. పెద్దన కవితావైభవం (వ్యాఖ్య) – డా॥పల్లా దుర్గయ్య (25–3–1980)

64. కంకంటి కవితావైభవం (వ్యాఖ్య) – కరుణశ్రీ (25–3–1980)

65. కుందుర్తి కవితా వైభవం (వ్యాఖ్య) – డా॥అద్దేపల్లి రామ్మోహన్‌రావు (17–3–1980)

66. వేడి వెలుగులు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (17–3–1980)

67. వేగుచుక్కలు (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (12–12–1980)

68. సూర్యుడు కూడా ఉదయిస్తాడు (వచనకవితా సంకలనం) – విశ్వనాథ సూర్యనారాయణ, జయప్రభ (12–12–1980)

69. పురాణసంకేతాలు (వ్యాస సంపుటి) – డా॥ముదిగొండ శివప్రసాద్ (12–12–1980)

70. మరో జంఘాలశాస్త్రి (వ్యాస సంపుటి) – అయల సోమయాజుల నాగేశ్వరరావు (12–12–1980)

71. ఆలోచనాలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – కట్టమంచి, రాళ్ళపల్లి, కొమఱ్ఱాజు, గిడుగు, ముట్నూరి, విశ్వనాథలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (14–12–1980)

72. శ్రీశ్రీ కవితావైభవం (వ్యాఖ్య) – డా॥మిరియాల రామకృష్ణ (20–1–1981)

73. రేఖలు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (5–4–1981)

74. ప్రేమచంద్ జీవితం–సాహిత్యం (వ్యాఖ్య) – డా॥దాశరథి రంగాచార్య (20–2–1981)

75. పువ్వులు నవ్వుతున్నాయి (వచనకవితా సంపుటి) – డా॥జి.కుమారస్వామినాయుడు (14–02–1981)

76. పింగళిసూరన కవితావైభవం (వ్యాఖ్య) – డా॥శ్రీరంగాచార్య (13–12–1981)

77. కన్నడ కవితాసౌరభం (వ్యాఖ్య) – డా॥గడియారం రామకృష్ణశర్మ (13–12–1981)

78. అయ్యలరాజు కవితావైభవం (వ్యాఖ్య) – డా॥కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రి (12–1981)

79. కావ్య సందర్శనం (ఉపన్యాస వ్యాససంపుటి) – ఆముక్త మాల్యద, పాండురంగ మహాత్మ్యాలపై ఉపన్యాస వ్యాసాలు–ఆచార్య దివాకర్ల వేంకటావధాని (12–1981)

80. నారాయణరెడ్డి సాహితీమూర్తి (విమర్శగ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (13–12–1981)

81. వెలుగుబాటలు (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (2–3–1982)

82. త్యాగరాజస్వామి భక్తి కవితావైభవం (వ్యాఖ్య) – ఆకెళ్ళ అచ్యుతరామమ్ (6–6–1982)

83. అడుగుజాడలు (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1–10–1982)

84. ఉపనిషత్సుధ (వ్యాససంపుటి) – ఇలపావులూరి పాండురంగారావు (5–12(1982)

85. తమిళసాహిత్యం–భారతి కవిత (వ్యాఖ్య) – డా॥చల్లా రాధాకృష్ణశర్మ (5–12–1982)

86. ఇతిహాసలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – రాణాప్రతాపసింహచరిత్ర, శివభారతం, ఆంధ్రపురాణం, పోతనచరితం, ఝాన్సీరాణి, వందేమాతరంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (5–12–1982)

87. మరో జంఘాలశాస్త్రి–2 (వ్యాస సంపుటి) – అయలసోమయాజుల నాగేశ్వరరావు (5–12–1982)

88. జానపద సాహిత్యం (వ్యాస సంపుటి) – డా॥ఆర్.వి.యస్.సుందరం (5–12–1982)

89. అభినవలోచనం (వ్యాస సంపుటి) – రాయప్రోలు, విశ్వనాథ, మధునాపంతులపై వ్యాసాలు–డా.జి.వి.సుబ్రహ్మణ్యం (1983)

90. ఆంధ్రసాహిత్య విమర్శ–ఆంగ్లప్రభావం (విమర్శగ్రంథం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (14–1–1983)

91. రవ్వలు (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (5–6–1983)

92. వెలుగుచూపే తెలుగుపద్యాలు (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1–8–1983)

93. తెలుగు వాగ్గేయకారులు (వ్యాఖ్య) – డా॥యస్.గంగప్ప (7–8–1983)

94. అన్నమయ్య (వ్యాఖ్య) – డా॥ముట్నూరి సంగమేశం (9–12–1983)

95. మాఘ కావ్యవైభవం (వ్యాఖ్య) – డా॥కె.వి.రాఘవాచార్య (9–12–1983)

96. స్వామి వివేకానంద కవితావైభవం (వ్యాఖ్య) – డా॥ఓగేటి అచ్యుతరామశాస్త్రి (9–12–1983)

97. సంస్కృతి (వ్యాఖ్య) – డా॥ప్రసాదరాయకులపతి (12–09–1983)

98. వాగ్భూషణం భూషణం (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (12–9–1983)

99. వెలుగురేఖలు (వచనకవితా సంకలనం) – తాళ్ళపల్లి మురళీధర గౌడ్ (9–12–1983)

100. సంస్కృతసాహితీలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – స్వప్నవాసవదత్తం, మృచ్ఛకటికం, అభిజ్ఞాన శాకుంతలం, ఉత్తరరామచరిత్రం, నాగానందం, ముద్రారాక్షసం నాటకాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (9–12–1983)

101. తెలుగులో స్వీయచరిత్రలు (వ్యాస సంపుటి) – డా॥అక్కిరాజు రమాపతిరావు ( 16–4–1984)

102. దేశమును ప్రేమించుమన్నా (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1–8–1984)

103. తెలుగు జానపదకథాసంకలనం (కథాసంకలనం) – జి.యస్.మోహన్ (10–1984)

104. దశరూపక సందర్శనం (వ్యాససంకలనం) – విషాదసారంగధర, ప్రతాపరుద్రీయం, బొబ్బిలియుద్ధం, గయోపాఖ్యానం, పాదుకాపట్టాభిషేకం, కన్యాశుల్కం, పాండవోద్యోగం, సత్యహరిశ్చంద్ర, వరవిక్రయం, నర్తనశాల నాటకాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (15–10–1984)

105. చిలకమర్తి కవితావైభవం (వ్యాఖ్య) - డా॥ముక్తేవి భారతి (5-10-1984)

106. తిక్కన రసభారతి (వ్యాఖ్య) - డా॥ఎల్లూరి శివారెడ్డి (5-10-1984)

107. కృష్ణశాస్త్రి కవితావైభవం (వ్యాఖ్య) - డా॥కడియాల రామమోహనరాయ్ (5-10-1984)

108. జననీ జన్మభూమిశ్చ (వ్యాఖ్య) - ఎంపిక చేసిన రామాయణ శ్లోకాలకు వ్యాఖ్య-డా॥యస్.బి.రఘునాథాచార్య (12-1984)

109. వ్యాససూక్తం (వ్యాఖ్య) - ఎంపిక చేసిన భారత శ్లోకాలకు వ్యాఖ్య - డా॥కె.కమల (7-12-1984)

110. వ్యాససాహితీసంహిత (ఉపన్యాస వ్యాససంకలనం) - వేదవ్యాసుని రచనలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (13-01-1985)

111. చాటువులు (వ్యాఖ్య) - ఎంపిక చేసిన చాటువులకు వ్యాఖ్య - డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1-1985)

112. (వివరాలు అలభ్యం)

113. (వివరాలు అలభ్యం)

114. జ్ఞానపదులు జానపదులు (వ్యాస సంపుటి) - డా॥దేవులపల్లి రామానుజరావు ప్రముఖులపై పరిచయవ్యాసాలు (5-10-1985)

115. జగద్గురు సాహితీలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) - శంకరాచార్యుల సాహిత్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (5-10-1985)

116. బాబాఫరీద్ సూక్తులు (సూక్తులు) - డా॥ఇలపావులూరి పాండురంగారావు (9-1986)

117. నన్నయభట్టు (వ్యాఖ్య) - డా॥దివాకర్ల వేంకటావధాని (12-1986)

118. హనుమప్ప నాయకుడు (పద్యకావ్యం) - డా॥తిరుమల కృష్ణదేశికాచార్యులు (12-1986)

119. తెలుగు బాలసాహిత్యం (వ్యాస సంపుటి) - డా॥వెలగా వెంకటప్పయ్య (12-1986)

120. కవిసమయాలు (సిద్ధాంత గ్రంథం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (26–4–1987)

121. నవ్యసాహితీలహరి (ఉపన్యాస వ్యాస సంకలనం) – నవల, కథానిక, వ్యాసం, నాటిక ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (10–1987)

122. తెలుగులో గేయనాటికలు (సిద్ధాంత గ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (12–1987)

123. అక్షరాల ఆలోచనలు (వ్యాస సంపుటి) – విశ్వనాథ, శ్రీశ్రీ, వానమామలై, దాశరథి, కుందుర్తి, భరద్వాజ, సి.నా.రె, ఉత్పల, బాపురెడ్డిలపై వ్యాసాలు – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (1–1988)

124. తెలుగు రుబాయిలు (వ్యాఖ్య) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (1988)

125. ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (ఉపన్యాస వ్యాస సంకలనం) – 1980–1990 తెలుగు సాహిత్యం, కవిత, నవల, కథానిక, పత్రికారచన, ప్రసార కళలు, విమర్శ, పరిశోధనలపై ప్రముఖుల వ్యాసాలు (2–1990)

126. శ్రీమద్రామాయణ కల్పవృక్షం శబరిపాత్ర పరిశీలన (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.కుమారస్వామి నాయుడు (2–1990)

127. యువత (వ్యాస సంకలనం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం, ఆచార్య వంగపల్లి విశ్వనాథం (సం) (3–1991)

128. పరిశోధన పద్ధతులు (వ్యాస సంకలనం) – డా॥ఆర్.వి.యస్.సుందరం (2–1990)

129. కిన్నెరసాని పాటలు–వాక్య ప్రయోగ వైచిత్రి (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.యస్.లక్ష్మి (12–1990)

130. కలంతో కాలం (వ్యాస సంపుటి) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (10–1990)

131. ఋతుసంహారం (పద్యకావ్యం) – కాళిదాసు శాకుంతలానికి తెలుగులో అనువాదం –డా॥తిరుమల కృష్ణదేశకాచార్యులు (1–1990)

131ఎ. అమృతం కురిసిన రాత్రి – డా॥వాక్యలయ భావపోషణ (సిద్ధాంత గ్రంథం) – బాలగంగాధరతిలక్ అమృతం కురిసిన రాత్రిపై పరిశోధన – డా॥వై.కామేశ్వరి (3–1991)

132. ఇరివెంటి రచనలు (సంపుటి) – ఇరివెంటి కథలు, కవితలు, గ్రంథపరిచయాలు, సమాలోచనల సంకలనం – తిరుమల శ్రీనివాసాచార్య (సం) (28–4–1991)

133. భారతంలో ప్రేమ కథలు (వ్యాస సంకలనం) – ముక్తేవి భారతి, లక్ష్మణరావు (5–1991)

134. ఆక్సిజన్ (వచనకవితా సంకలనం) – డా॥నాగినేని భాస్కరరావు (8–1991)

135. ఆధునిక సాహిత్య విమర్శ–అభిరుచి ధోరణి (సిద్ధాంత గ్రంథం) – డా॥యం.నాగరాజు (11–1991)

136. ద్వితీయ భాషగా తెలుగు బోధన – సమస్యల విశ్లేషణ (సిద్ధాంత గ్రంథం) – డా॥వై.రెడ్డి శ్యామల (1–1992)

137. గంగా తరంగాలు (వచనకవితా సంపుటి) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (1–1992)

138. పాతికేళ్ళ పత్రికారచన (ఉపన్యాస వ్యాస సంకలనం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం, తిరుమల శ్రీనివాసాచార్య (సం) సదస్సు వ్యాసాలు (5–1992)

139. అమృత రాజీవం (వచన కవితా సంకలనం) – వివిధ కవులు (6–1992)

140. తెలుగు కవిత–లయాత్మకత (వ్యాససంపుటి) – డా॥సి.నారాయణరెడ్డి (6–1992)

141. అనుభూతి (వచనకవితా సకంలనం) – యువభారతీయులు (6–1992)

142. వెండి వెలుగులు (వ్యాస సంకలనం) – ప్రముఖుల వ్యాసాలు–రజతోత్సవ సంచిక (6–1992)

143. భావుకసీమ (వ్యాస సంపుటి) – డా॥కోవెల సంపత్కుమారాచార్య (7–2–1993)

144. దీపాల చూపులు (వచనకవితా సంపుటి) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (3–1993)

145. సాహితీ సమాలోచనం 1992–1993 (ఉపన్యాస వ్యాససంకలనం) – 1992–1993 సంవత్సరాలలో వెలువడిన సాహితీ ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

146. విద్యా వైద్య శాస్త్ర కళారంగాలు – మానవతావిలువలు (ఉపన్యాస వ్యాసాలు) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

147. స్త్రీవాద ధోరణులు సమకాలీన సాహిత్యం (ఉపన్యాస వ్యాససంకలనం) - ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3-1994)

148. వివేకానంద లహరి (ఉపన్యాస వ్యాససకంలనం) - ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3-1994)

149. కొత్తగొంతుకలు-సరికొత్త విలువలు (ఉపన్యాస వ్యాససంకలనం) - ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3-1994)

150. తెలుగు తమిళ కవితలు జాతీయవాదం (వ్యాఖ్య) - చల్లా రాధాకృష్ణమూర్తి (2-1994)

151. ఆధునికసాహిత్యం దళిత స్పృహ (ఉపన్యాస వ్యాససంకలనం) - ప్రముఖుల ఉ పన్యాస వ్యాసాలు (3-1994)

152. త్యాగరాయకృతులు- స్వరలయభావపోషణ (సిద్ధాంత గ్రంథం) - డా॥బి. ఉషాలక్ష్మి (4-1994)

153. ప్రశ్నార్థకాలు (వచనకవితా సంపుటి) - తాళ్ళపల్లి మురళీధర గౌడ్ (10-1994)

154. జక్కన చరిత్రము (పద్యకావ్యం) - డా॥తిరుమల కృష్ణదేశికాచార్యులు (12-1994)

155. పాలసముద్రం (వచనకవితా సంపుటి) - యస్. బాబు (3-1995)

156. శ్రీకృష్ణుడు జ్ఞానసారథి (వ్యాసాలు) -అడవి సూర్యకుమారి (3-1995)

157. రావిశాస్త్రి ధర్మేతిహాసం (విమర్శనాగ్రంథం) - ముదిగొండ వీరభద్రయ్య (8-1995)

158. విశ్వనాథ నవ్య సంప్రదాయం (విమర్శ గ్రంథం) - డా॥జి. వి. సుబ్రహ్మణ్యం (9-1995)

159. కొలమానం (వ్యాససంపుటి) - డా॥జి. వి. సుబ్రహ్మణ్యం-పత్రికా వ్యాసాలు (9-1995)

160. విశ్వనాథసాహితీ సమాలోచనం (ఉపన్యాస వ్యాససంకలనం) - విశ్వనాథ సాహిత్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (9-1995)

161. (వివరాలు అలభ్యం)

162. స్వతంత్రస్వర్ణభారతి (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (9–1997)

163. దివాకర్ల వేంకటావధాని జీవితం–సాహిత్యం (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.కుమారస్వామి నాయుడు (1998)

164. వ్యక్తిత్వ వికాసం–ఆరోగ్యసూత్రాలు (ఆరోగ్యగ్రంథం) – డా.నాగినేని భాస్కరరావు (12–8–2001)

165. గోరంతదీపం కొండంత వెలుగు (బాలసాహిత్యం) – రెడ్డి రాఘవయ్య (9–2001)

166. హాస్యలహరి (వ్యాస సంకలనం) – తెలుగు సాహిత్యంలో హాస్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (29–12–2002)

167. నవజీవనం (నాటకం) – డా॥నాగినేని భాస్కరరావు (21–8–2003)

168. ఆలోచనం (వ్యాస సంపుటి) – నందిని సంచికలలో డా॥జి.వి.సుబ్రహ్మణ్యం గారి సంపాదకీయ వ్యాసాలు (3–2007)

169. అక్షతలు (వచనకవితా సంపుటి) – అయ్యదేవర పురుషోత్తమరావు (4–9–2007)

170. అనంత గీత (గేయసంపుటి) – డా॥మాడభూషి అనంతాచార్య–భగవద్గీత అనువాదం) (4–9–2007)

171. సాహిత్యం ఎందుకు చదవాలి? (విమర్శ గ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (4–9–2007)

172. చేగొండి కథాకదంబం (కథాసంపుటి) – చేగొండి రామజోగయ్య (4–2008)

173. ఇరివెంటి బాలసాహిత్యం (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి బాలసాహిత్య గ్రంథాల సంపుటి (24–8–2008)

174. శ్రీకృష్ణదేవరాయలు (చారిత్రక నవల) – అయ్యదేవర పురుషోత్తమరావు (2008)

175. మరో జంఘాలశాస్త్రి (ఉపన్యాస వ్యాససంపుటి) – మరో జంఘాలశాస్త్రి మొదటి, రెండవ సంపుటాలకు పరివర్ధిత ప్రచురణ – అయలసోమయాజుల నాగేశ్వరరావు (2009)

176. వేదవిజ్ఞానలహరి (ఉపన్యాస వ్యాససంకలనం) – వేదాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (1–11–2009)

177. విజయానికి అభయం (వ్యాససంపుటి) - గంధం నారాయణ - వ్యక్తిత్వ వికాసవ్యాసాలు (11-3-2011)

178. ఉపనిషత్సుధాలమరి (ఉపన్యాస వ్యాససంకలనం) - ఉపనిషత్తులపై ప్రముఖుల ఉపన్యాసవ్యాసాలు ( 12-4-2011)

179. వ్యక్తిత్వవికాసం-సూక్తులు - ఆచార్య వంగపల్లి విశ్వనాథం, డా॥నాగినేని భాస్కరరావు (సం) (3-6-2012)

180. దివాకరప్రభ (పద్యం) - డా॥తిరుమల శ్రీనివాసాచార్య-ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి జీవితచరిత్ర (2012)

181. ప్రభావం (వ్యాససంకలనం) - నందిని సంచికలలో ప్రచురింపబడిన ప్రముఖుల జీవితాలను ప్రభావితం చేసిన వ్యక్తుల, గ్రంథాల, సంఘటనలను గూర్చి వారి కలం నుండే జాలువారిన వ్యాసాలు (2013)

182. దాశరథి కవితావైభవం (కావ్యం) - డా. తిరుమల శ్రీనివాసాచార్య

183. చౌరవ (కవితాసంపుటి) - డా. నాగినేని భాస్కరరావు (2016)

184. నగరం నిద్రపోదు (దీర్ఘకవిత) - డా. నాగినేని భాస్కరరావు (6. 11. 2016)

185. మీ మార్గం-మీ గమ్యం (యువతకు వ్యాసాలు) - ఆచార్య వంగపల్లి విశ్వనాథం మరియు శ్రీ 'వేగేశ్న' గోవిందరాజులు (2017)

186. వ్యక్తిత్వ వికాసం (వ్యక్తిత్వ వికాస రచన) - ఆచార్య వంగపల్లి విశ్వనాథం మరియు డా. జి. ఎల్. కె. దుర్గ (2017)

187. Personality Development, (వ్యక్తిత్వ వికాసం) - ఆచార్య వంగపల్లి విశ్వనాథం (2018)

188. You & Your Life (వ్యక్తిత్వ వికాసం) -ఆచార్య వంగపల్లి విశ్వనాథం (2018)

189. గాంధీమహా(త్ముని)సూక్తులు - సంకలనం: సుధామ (2018)

190. గాంధీ సందేశపథం (కవితాసంకలనం) - యువకవుల కవితాసంకలనం (జనవరి 2019)

191. అమరుడు బాపూజీ (జీవితచరిత్ర) - దేవులపల్లి ప్రభాకరరావు (అక్టోబర్ 2019)

192. తెలుగువారి నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు (వ్యాఖ్య) – విహారి (అక్టోబర్ 2019)

193. పుంభావ సరస్వతి–పుట్టపర్తి (జీవితం–సాహిత్యం) – డా.పుట్టపర్తి నాగపద్మిని (అక్టోబర్ 2019)

194. అభినవపోతన–వానమామలై (జీవితం–సాహిత్యం) – డా.తిరుమల శ్రీనివాసాచార్య (అక్టోబర్ 2019)

195. తెలుగు సొగసులు (విద్యార్థి యువతకు పరిచయ వ్యాసాలు) – సుధామ (ఆగస్టు'2020)

**<u>పూర్తి వివరాలకు, ప్రతులకు సంప్రదించండి:</u>**

| | | | |
|---|---|---|---|
| ఆచార్య ఫణీంద్ర | – | అధ్యక్షులు : | 99598 82963 |
| జీడిగుంట వెంకటరావు | – | కార్యదర్శి : | 98668 87622 |
| ఆమాతి రవీంద్ర | – | కోశాధికారి : | 98499 09896 |
| ఆచార్య వంగపల్లి విశ్వనాథం | – | సమావేశకర్త : | 79891 80414 |

**TELUGU SOGASULU**
(Beauty of Telugu Language
Introductary Essays for students and youth)
*by* **SUDHAMA**

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగు దీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాలవైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే ప్రథమకర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదైనా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం
ఆ పది మంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషి చేద్దాం


**యువభారతి**
సాహితీ సాంస్కృతిక సంస్థ
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001